ఇరువదిమూడవ

# ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

పెదపాలెము (తెనాలి తాలూకా)

మే 27-28, 1942




ప్రకాశకులు
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము
పటమటలంక (వయా) బెజవాడ
1942

B

*

*   *

## గ్రంథాలయ వేదము

వాయువెట్టులు స్వేచ్ఛమై ప్రజకు దొరుకు
నట్లె జ్ఞానంబు కూడను నబ్బవలయు
ఉదక మెల్లర కేరీతి నొదవునట్లె
జ్ఞానముం గూడ సేవ్యంబు గాగవలయు
సూర్యచంద్రుల తేజంబు చూరలాడ
నెల్లవారికి లభ్యమై యెసగునట్లె
జ్ఞానముంగూడ సులభంబు గాగవలయు.

*   *

*

భారతీ ప్రెస్, తెనాలి

# ప్రకాశకుల విజ్ఞప్తి

పెదపాలెంలో జరిగిన 23 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభా సమాచారాలను 'ఆంధ్రగ్రంథాలయం' మహాసభా సంచికద్వారా ప్రకటించాలనుకున్నాం. డబ్బులేక, కాగితపు కరవువల్ల చాల యిబ్బందులకులోనై దీనిని సకాలానికి వెలువరించడం యెప్పటికప్పుడు కష్టంగా వుంటూవచ్చింది. ప్రయత్నలోపంలేకుండా పై సంచిక ప్రకటనను ప్రారంభించబోయేసరికి, మాసానికి పైబడ్డగడువుతో ప్రకటితమవుతూవున్న పత్రికలికముందు ప్రకటింపరాదనే ఇండియాప్రభుత్వంవారి ఫర్మానా నవంబరు మొదటి వారాంతమున బయటబడింది. దీనితో పై పత్రికకు స్వస్తి చెప్పవలసి వచ్చింది.

పై మహాసభావిషయం పత్రికల్లో సరిగ ప్రకటింపబడలేదు. మహాసభలు మనకు ప్రధానంగా ప్రచారసాధనాలుగ వుంటున్నై. కనుక వీని విషయమై సరియైన ప్రచురణ జరుగకపోవడం భావ్యంగా కనబడలేదు. పైగా పై మహాసభ కారణాంతరములచే ఒక పర్యాయం వాయిదా పడినందున మొదటితూరి సభనిమిత్తం బయలుదేరి వచ్చినవారు రెండవపర్యాయం తిరిగి హాజరవడం సంభవించలేదు. వీరుగాక అసలు సభకురాని గ్రంథాలయసేవకులెందరో యీ సభలో జరిగినవృత్తాంతము తెలిసికోవాలనే కుతూహలంతో వుండడం సహజం. మరియు కొందరు గ్రంథాలయోద్యమ సంబంధంగా తాముకూర్చిన విషయాలను, తమ యనుభవములను వ్యాసరూపముగ లిఖించి శాఖాసమావేశములలో చర్చించునిమిత్తమై పంపియుండిరి. ఇట్లుచేరిన వ్యాసాలను సంపూర్ణంగా చదివి అందలి విషయాలనుగూర్చి చర్చించుటకును సమయములేక పోయెను. కాబట్టి వీనిని ప్రకటించడం అవసరంగాతోచింది. ఇందుమూలాన కొంత ఉపయోగముంటుందనే తలంపుతో ఈవ్యాసాలలో కొన్నింటినీ, సంగ్రహంగా మహాసభా కార్యక్రమంతోపాటు మహాసభకుచేరిన సందేశాలను ప్రకటించడానికి నిశ్చయించుకున్నాం.

ధనాభావమువలనను, మహాసభకుచేరిన వ్యాసములును తగినన్ని లేనందునను ఈ సంచిక చాలచిన్నదిగనే తయారైనది. మహాసభా సంచికలు మున్ముందెక్కువ వ్యాసములతో మిక్కిలి పెద్దవిగ ప్రకటితమగునట్లు చూడవలసినవిధి ఆంధ్రదేశగ్రంథాలయ సేవకులందరిపైననుగలదు.

ఇట్లు విన్నవించు,

పెదపాలెం
5–12–42

పాతూరి నాగభూషణం
కార్యదర్శి

# సందేశములు

గ్రంథాలయోద్యమజ్యోతి నిరంతరాయముగ వెలుగుటకై మహాసభల చాలగ నేర్పాటుచేయుటలో పట్టుదలతో మీరు చేయుప్రయత్నములకు మిమ్మభినందించవలసియున్నది.

మహాసభకు మూడుశాఖలున్నట్లు తెలియుచున్నది.

1. ఇందు ప్రచారశాఖ ప్రజాసామాన్యముయొక్క దృష్టిని గ్రంథాలయాలవైపుకు మరల్చుటకై యేర్పడినట్లెంతును. ఈశాఖలో మీరు గ్రంథములయు, గ్రంథాలయములయు ప్రయోజనములను వివరించు నుపన్యాసముల నేర్పాటుచేయుదురని విశ్వసింతును. ఎచ్చట నివసించుచున్నను, ప్రతిపౌరునికి అందుబాటులో నుండులాగున ధర్మగ్రంథాలయములను, గ్రంథప్రచార కేంద్రములను (Delivery stations) విరివిగా స్థాపించి నిర్వహించవలసిన విధి స్థానికసంస్థలపై గలదు. కాన వీనిసభ్యులందరికీ ఈశాఖయొక్క సందేశము చెవులబడునని ఆశించుచున్నాను.

2. మీ సాంకేతికశాఖ విషయమై జరుగదగినపని విస్తారముగ గలదు. వీలైనన్ని గ్రంథాలయములు చేపట్టదగిన వర్గీకరణపద్ధతి మన సమస్యలలో మొదటిది. ఈ విషయమై మనము నూతనారంభమునకు దొరకొనవచ్చును. త్వరపడి, మూడుపురుషాంతరములకు ముందు కనుగొనబడిన పరులవిధానము నాశ్రయించు పొరబాటును మనము గావింపరాదు గ్రంథాలయవృత్తికి మూలపురుషుడైన 'డ్యూయీ' తన మొట్టమొదటి (Poineer) వర్గీకరణపద్ధతి కనిపెట్టిన నాటినుండి ఇప్పటికి విజ్ఞానమనంతముగ పెరిగిపోయినది....ఈవిధానములో చాల లోటున్నది ... కోలనువర్గీకరణపద్ధతి మెకానో పరికరముల సిద్ధాంతముపై నాధారపడియున్నది....అనుభవం లేకుండగనే ఇది చాల కఠినపద్ధతియను వారిమాటల మీరు పాటింపకుడు. కేవలం విషయస్వభావాన్నిబట్టి ఏవిధానంగాని సులభంగా వుండదు. కాఠిన్యము విధానంలోగాక విజ్ఞానంయొక్క చిక్కుస్థితిలోనేవుంటుంది. విజ్ఞానప్రపంచంలో మిగుల తికమకలతోకూడిన పరస్పరాధారము, పోలిక వ్యాపించియుండడం మూలాన, వర్గీకరణమనేది ప్రత్యేకశిక్షణ బొంది, శ్రమజేయుస్వభావము, విమర్శనాబుద్ధిగల వారికి మాత్రమే సాధ్యమైనపనిగ నేర్పడినది.

పుస్తకాల జాబితానిబంధనలు మరియొకసమస్య... ఈవిషయంలోకూడ సాంకేతికశాఖ చేయదగినపని చాలావుంది. ఇందువిషయమైన నాకృషి నా 'వర్గీకరణ జాబితా నిర్మాణనిబంధన' (Classified Catalogue code) లో కానవగును.

భారతీయ విజ్ఞానవిషయములపై పుస్తకాలజాబితాలు, రిఫరెన్సుపుస్తకాల ప్రశ్న మరొకటి. ఇట్టి పుస్తకాల జాబితానుగాని, రిఫరెన్సుపుస్తకాన్నిగాని తయారు చేయాలంటే దేశసాంప్రదాయాలను గుర్తెరిగిన భారతీయులుమాత్రమే పనికివస్తారు. నా సహోద్యోగియగు శ్రీ కే. యమ్. శివరామన్ తోడ్పాటుతో ఇటీవల ప్రచురింపబడిన

'బిబ్లియోగ్రఫీ ఆఫ్ రిఫరెన్స్‌బుక్స్ అండ్ బిబ్లియోగ్రఫీస్' అనేపుస్తకంద్వారా ఈ విషయంలో సాకృషి ప్రారంభమయింది. మనం చేయవలసిన మహాకార్యంలో ఇది అణుమాత్ర ప్రయత్నమే.

3. మీ వయోజనవిద్యాశాఖా కార్యక్రమంకూడ తక్కువ ప్రయాసకరమైనదిగా వుండదు. ఎందువల్లనంటే, బోధకులను మాత్రమేగాక విద్యార్థులను సైతం సంపాదించడానికి, వయోజనులను పుస్తకాలవైపు కాకర్షించడమేకాక వారి కవసరమైన గ్రంథాలనుకూడ తయారుచేయడానికి, స్థానికసంఘాల కీవిషయమం దభిరుచికల్పించుటయేగాక ఏలాటి ప్రయత్నసమ్మగాని కలుగనిపదతిని ప్రభుత్వసంబంధమైనదియు, ఇతరములు నగు అన్ని ఏజన్సీల శక్త్యుత్సాహములను కూడ దీయుటకును అనువగు మార్గములను సాధనములను మీరన్వేషించవలసియుండును.

మీ మహాసభ కన్నివిధముల శుభంబగుగాక !

(సం.) యస్. ఆర్. రంగనాథన్
ఎం.ఏ.ఎల్.టి., ఎఫ్.ఎల్.ఏ.
మదరాసు యూనివర్సిటీ గ్రంథాలయభాండాగారి

"మహాసభ దిగ్విజయముగా జరుగవలెనని కోరుచున్నాను. ఆంధ్రదేశములోని ప్రతిగ్రామములోను గ్రంథాలయము స్థాపితమై ఆంధ్రుల విజ్ఞానము వృద్ధిచెందవలెనని ఆశించుచున్నాను."

(సం.) అయ్యదేవర కాళేశ్వరరావు
మాజీ పార్లమెంటరీకార్యదర్శి

"ఇట్టిసభలు గ్రామాల్లో ఏర్పరచుచున్నందులకు సంతోషము."

(సం.) పులివర్తి శరభాచారి
స్కూళ్లడెప్యూటీఇన్‌స్పెక్టరు

"గ్రంథాలయసహాయంతో యువకులు దేశాన్ని ప్రపంచంతోపాటు స్వాతంత్ర్య పథానికి నడుపుతారని ఆశిస్తాను."

(సం.) వావిలాల గోపాలకృష్ణయ్య

"దైవానుగ్రహమున గ్రంథాలయోద్యమ మతిశీఘ్రముగా దేశముయొక్క, జాతి యొక్క విజ్ఞానవికాసములఁ బెంపొందించి భారతదేశమును వర్ధిల్లఁజేయుఁగాక."

(సం.) జంపాల వేంకటనృసింహము
ఉభయభాషాప్రవీణ

"ఈ కష్టకాలములో గ్రంథాలయసోదరులు చేయదగిన మహత్తరమైనపని యున్నదని నాతలంపు. ఈ సభలయందు అట్టి ప్రణాళిక నొకదానిని యోచించి కార్యసిద్ధికి దీక్షవహింపుడు."

(సం.) అయ్యంకి వెంకటరమణయ్య
ఆం. దే. గ్రం. సంఘోపాధ్యక్షుడు

"తమ ఆశయములు మహోన్నతములు. గ్రంథాలయోద్యమము విజ్ఞాన మహోద్యమమని నా అభిప్రాయము. దీనివలన మనదేశమునకును, జగతికిని శాంతిగలుగును."

(సం.) జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి
ఎం ఏ., బి. యల్.

"మహాసభా కార్యక్రమ ఫలితముగ గ్రంథాలయములు పూర్ణముగ ఆంధ్రదేశములో సేవచేయుసంస్థలుగ వన్నెకెక్కుగాక !"

(సం॰) నాగినేని వెంకయ్య
ఆం. దే. గ్రం. సంఘోపాధ్యక్షులు

"శ్రీ అధ్యక్షమహనీయుల 'ప్రతాపము'వలన ఈ నిండువేసవిని తమ మహాసభ 'సురవరము' లభించినట్లు జయప్రదముగ నిర్వహింపబడి తెలుగుదేశమున వెలుగును ప్రసరింపజేయగలదనియే విశ్వసించుచున్నాను."

(సం.) చిదిరెమఠము వీరభద్రశర్మ
'విభూతి' సంపాదకులు

"మా ప్రతాపరెడ్డిగారివంటి భాషాయోధుల యధ్వర్యమున మహాసభ యావదాంధ్ర దేశ గ్రంథాలయోద్యమవికాసమునకు తోడ్పడగలదని యాశించుచున్నాను."

(సం.) కొత్తపల్లి వేంకటరామలక్ష్మీనారాయణశర్మ
పాల్వంచ సంస్థానవిద్యాధికారి

"గ్రామములందు వయోజనవిద్యా ప్రచారంచేయుటలో భారతదేశమందంతటా ప్రధానతాంబూలమునందినది మన ఆంధ్రదేశపు గ్రంథాలయోద్యమము. ఈసమావేశం సుప్రసిద్ధమైన గ్రామగ్రంథాలయం కల్గిన (పెదపాలెం) గ్రామమందుచేరుట సంతోష విషయం. మిత్రులు ప్రతాపరెడ్డిగారు భాషాసేవయందు, గ్రంథాలయోద్యమమందు హైదరాబాదునందేగాక ఆంధ్రదేశమంతటా పేరుపొందినవారు. వారు తమకథల ద్వారా రైతాంగము నెటుల నూతనరీతిని సేవించగునో భాషా సేవకులకు చూపెట్టుచున్నారు.

రేడియో నొకవంక, నిర్బంధప్రారంభవిద్య మరోవంక, విజ్ఞాన దాయకమగు పుస్తకాలు - పత్రికలప్రచురణ మొకవంక, గ్రామ గ్రామముల కేగుచు పాటలు - పద్యాలు - కథలు చెప్పుచూఉండే యాత్రికులు మరోవంక చతుర్భుజముల బొందుచు గ్రంథాలయోద్యమము నూతనరీతి గ్రామీణుల సేవించుగాక !"

(సం.) రంగ
ఎం. ఎల్. ఎ (సెంట్రల్)

# విషయసూచిక (Contents)

చిత్రములు

1

# ౨౩ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## పెదపాలెము

1942 వ సం. మేనెల 27, 28 తేదీలలో పై మహాసభ తెనాలి తాలూకా పెదపాలెం గ్రామమున శ్రీ పుతుంబాక శ్రీకృష్ణయ్యాగారి యింటిముందు నిర్మింపబడిన పందిరిలో నత్యంత వైభవముగ జరుపబడినది. నిజాం ఆంధ్రనాయకులు, సుప్రసిద్ధ భాషాసేవకులు, గోల్కొండ పత్రికాధిపులు నగు శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డి, బి. ఏ., బి. ఎల్ గారు సభాధ్యక్షత వహించిరి. మద్రాసునగర మాజీమేయరు, మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ ఉపాధ్యక్షులు నగు శ్రీమాన్ కెత్తే వేంకటస్వామి నాయుడు, బి. ఏ., బి. ఎల్. గారు సభను ప్రారంభించిరి. ఆంధ్రదేశములోని వివిధ ప్రాంతములనుండి 60 మంది ప్రతినిధులు సభకు వచ్చిరి. పెద్దలలో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, గోపరాజు రామచంద్రరావు, మాగంటి బాపినీడు, మోటూరి సత్యనారాయణ, కల్లూరి చంద్రమౌళి, శరణు రామస్వామిచౌదరి, జమ్ములమడక మాధవరామశర్మ, వడ్లమూడి వెంకటరత్నం, గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగార్లు తమరాక చేతను, అమూల్యోపదేశముల చేతను మహాసభకు వన్నెదెచ్చిరి.

గ్రంథాలయ సభలన్న కొంతకాలముగ గల నిర్లక్ష్యభావ మీసభ మూలమున తొలగుటయేగాక, జనసామాన్యము యొక్క విజ్ఞానాభివృద్ధికి పాటుపడు నీయుద్యమముయొక్క విశిష్టతను ప్రతినిధులు, ప్రేక్షకులుకూడ గ్రహించిరని చెప్పవచ్చును. గ్రంథాలయాదర్శము నెడ భక్తితాత్పర్యములు గల గ్రంథాలయ సేవకులు పలువురు సభలో నుండుటయు, సభాకార్యక్రమమును నడపిన నాయకుల అనుభవపూర్వకములగు నుపన్యాసములును, శాఖా సమావేశములలో గ్రంథాలయ సేవకులు చదివిన వ్యాసములును దీనికి కారణమని చెప్పవచ్చును. రైల్లు రాక పోకల మూలమున పెద్దలరాక యాలస్యమైనందున తెరపిలేని కార్యక్రమము కొంత యిబ్బందిని కలిగించినను మొత్తముపై

మహాసభా కార్యక్రమము మొదటినుండి చివరవరకు శాంతముగను చక్కగను సాగినదని చెప్పవచ్చును.

## ప్రారంభము

మహాసభ మే 27వ తేదీ సాయంత్రము 3 గంటలకు ప్రారంభింప బడెను. పెదపాలెము, చుట్టుపట్టు గ్రామములనుండి సభకేతెంచిన జనము వెయ్యివరకు నుండిరి. ఆహ్వాన సంఘసభ్యులకు, ప్రతినిధులకు సభావేదిక కిరుప్రక్కల స్థలము ప్రత్యేకింప బడెను. అధ్యక్ష ప్రారంభకులు, ఆహ్వాన సంఘాధ్యక్షులు ఉన్నతాసనములపై నాసీనులైన పిమ్మట సేవాశ్రమ సభ్యులు శ్రీ జంధ్యాల వేంకటేశ్వర్లుగారు దైవ ప్రార్థన గావించిరి. రేవేంద్రపాడు నవ్యభారతి గురుకుల విద్యార్థినులు జాతీయగీతముల బాడిరి. శ్రీ కోటంరాజు శంకరరావుగారు (కనగాల) గ్రంథాలయ గీతములచే సభికులను ప్రబోధించిరి. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ పుతుంబాక సీతారామయ్యగారు తమకు సహజమగు మధురవాక్కులతో సభవారికి స్వాగతమును చదివిరి. ఇట్లొనర్చుటలో వారు పెదపాలెము గ్రామముయొక్క చరిత్రను—ముఖ్యముగ నచ్చటి గ్రంథాలయము మొదట 1905 వ సం.లో నేర్పడి యెట్లు పనిచేయుచు వచ్చినదియు సభవారి కెఱుకపఱచిరి. వీరి యుపన్యాసధోరణి యొక కావ్యపద్ధతిని నడచినదని చెప్పవచ్చును.

అనంతరము శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, మల్లెల శ్రీరామమూర్తి, శరణు రామస్వామి చౌదరిగార్లు సభాధ్యక్షుల పరిచయము చేయుచు వారి దక్షతనుగూర్చి సభికులకు తెలిపిన పిమ్మట సభా ప్రారంభకులకు ఆహ్వాన సంఘపక్షమున సన్మాన పత్రము సమర్పింపబడెను. దీనిని ఆహ్వాన సంఘకార్యదర్శి శ్రీ పుతుంబాక శ్రీరాములుగారు చదివిరి. అంతట శ్రీ వేంకటస్వామినాయుడు గారు తమ ప్రారంభోపన్యాసము నుపక్రమించి ముందుగ పెదపాలెము వారి మర్యాదను కొనియాడిరి. భారతదేశములో నే ప్రాంతమువారికి గాని తీసిపోని విజ్ఞానముతో కూడిన ఆంధ్రదేశీయులలో తా మొకరై

యున్నందుకు గర్వించుచుంటి మనిరి. తెలుగునాట నడచుచున్న గ్రంథాలయోద్యమమును, దీనిని సాగించుచున్న గ్రంథాలయ సేవకులను వారు హృదయపూర్వకముగ నభినందించిరి. తిరుపతివంటి దేవస్థానములు పూర్వ విజ్ఞానమును బయటికి తెచ్చుటతో తృప్తిపడిన చాలదనియు, గ్రంథాలయోద్యమవ్యాప్తి, వయోజన విద్యాప్రచారముల మూలమున నేటి ప్రజలలో విజ్ఞానమును విరివిగ వ్యాపింపజేయుట కీ సంస్థలు కృషిచేయు టవసరమనియు చెప్పి, ఆధునిక విజ్ఞానముపట్ల తమకుగల అచంచల విశ్వాసమును వెలిబుచ్చిరి.

తరువాత సభాధ్యక్షులు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి కాహ్వానసంఘమువారు సమర్పించిన సన్మానపత్రమును శ్రీ పాతూరి నాగభూషణంగారు చదివిరి. అధ్యక్షులు ముందు దీనివిషయమై కొంత ప్రస్తావించిన పిమ్మట తమ యుపన్యాసము నుపక్రమించిరి. వీరు ఆదికాలపు గ్రంథాలయములతో నారంభించి వివిధ దేశములలో నేడీ యుద్యమ మేస్థితియం దున్నదియు వివరించుటయేగాక గ్రంథాలయ సేవకులకు అనుభవముతోకూడిన చక్కని సూచనల గావించిరి. విషయము గొప్పదైనను దానిని చెప్పుటలో రెడ్డిగారికిగల నేర్పు విద్యావంతులతోపాటు పామరజనమునుకూడ సంతోషపెట్టగలిగి యుండెను. వారి యుపన్యాసములో నెంతో పరిశ్రమ ఫలితముగ తెలిసికొన్న విషయములు బహుళముగ నుండెను. గంటకుపైగ నేకధాటిని వారు ప్రసంగము చేసినను సభికులు విసుగుచెందలేదు. పైపెచ్చు వారి పాండిత్య ప్రకర్షకు, భాషావైదుష్యమునకు, భావప్రకటనా చాతుర్యమునకు నాశ్చర్య సంతసముల బొందిరనుట నిజము.

అధ్యక్షుని యుపన్యాసానంతరము సభ జయప్రదముగ జరుగునట్లాశీర్వదించుచును, సభద్వారా జరుగవలసిన పనిని సూచించుచును పంపబడిన సందేశములు చదివి వినిపించుట జరిగెను. ఈ సందేశములు బంపినవారిలో మద్రాసు యూనివర్సిటీ లైబ్రేరియను రావుసాహెబ్ యస్. ఆర్. రంగనాథన్, ఆచార్య రంగా, అయ్యదేవర కాళేశ్వరరావు, వావిలాల గోపాలకృష్ణయ్య, పీతాంబరం వేంకట

కృష్ణమాచార్యులు (విశాఖపట్టణజిల్లా గ్రంథాలయసంఘ కార్యదర్శి), చిదిరెమఠము వీరభద్రశర్మ ('విభూతి' పత్రికా సంపాదకులు—సికింద రాబాదు) గార్లు కలరు. ఇంతటితో ప్రొద్దుగ్రుంకుటయు, మహాసభా ప్రారంభ సమావేశము ముగియుటయు జరిగినది.

రాత్రి 8 గంటలకు హరిజన దాసరులచే 'పద్మవ్యూహము' బుర్రకథ యేర్పాటు చేయబడెను.

## శాఖాసమావేశములు

**వయోజనవిద్యాశాఖ :** 28–5–42 వ తేదీ ఉదయం 7 గంటలకు వయోజన విద్యాశాఖా సమావేశము శ్రీయుత గోపరాజు రామచంద్రరావు, ఎం. ఏ. గారి అధ్యక్షతను మహాసభ పందిరిలో ప్రారంభమయ్యెను. అధ్యక్షుల ఉపన్యాసానంత రము శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ. గారు "లాబాక్ అక్షరాభ్యాస పటము", శ్రీ వడ్లమూడి వేంకటరత్నముగారు "వయోజనవిద్య", శ్రీ మోటూరి సత్యనారాయణగారు "సాక్షరతా ప్రచారమా లేక సంస్కృతిప్రచారమా ?"- అను విషయములపై తమ వ్యాసముల ముందు చదివిరి. తదుపరి జరుగవలసిన కార్య క్రమమున కడ్డులేకుండుటకై తక్కిన వ్యాసములను సంగ్రహముగ చెప్పునట్లు చేసిరి. ఈశాఖకు పంపబడిన వ్యాసములు మొత్తమెనిమిది. ఇందు కాకినాడ వాస్తవ్యులు శ్రీ యాతగిరి లక్ష్మీవెంకటరమణగారి "వయోజనవిద్య - రహస్యోదేశము" అను వ్యాస మొకటిగలదు.

**ప్రచారశాఖ :** మహాసభా మంటపముననే 28 వ తేది ఉదయము 10 గంటలకు ప్రారంభమైన ప్రచార శాఖాసమావేశము 11½ గంటలకు సమాప్తమయ్యెను. దక్షిణ భారత హిందీప్రచార సభాకార్యదర్శి శ్రీమోటూరి సత్యనారాయణ గారు దీని కధ్య క్షత వహించిరి, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు "గ్రంథాలయము-ప్రదర్శన కార్యము", శ్రీ పాతూరి నాగభూషణంగారు "గ్రంథాలయ నిర్వహణ సంఘాలు" అను తమ వ్యాసములను ముందు చదివిరి. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు "సాహిత్యవిభక్తి", శ్రీ కస్తూరి కుటుంబరావుగారు "ఉద్యమవ్యాప్తి-గ్రంథాలయసేవ" లను గూర్చిన తమ యుపన్యాసములు సంగ్రహముగ చెప్పిరి. శ్రీ గొట్టిపాటి వెంకట సుబ్బయ్యగారు తమ "బాలవాఙ్మయం" వ్యాసమునందలి ముఖ్యభాగములను చదివి వినిపించిరి. హిందూపురమునుండి శ్రీ దు. కృష్ణయ్యగారు పంపిన "ధర్మగ్రంథాలయము" ను వ్యాసమును శ్రీ పాతూరి నాగభూషణంగారు చదివిరి. ఈ సమావేశములో చదువు నిమిత్తము వచ్చిన మఱియెనిమిది వ్యాసముల చదువుట కవకాశములేక యవియన్నియు చదివినట్లెంచు కొనబడెను. అధ్యక్షులు కడపట నుపన్యసించిరి.

సాంకేతికశాఖ: సాంకేతిక శాఖాసమావేశము శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావు. ఎం. ఏ, గారి అధ్యక్షతను 28 వ తేదీ మధ్యాహ్నము 1 గంటకు ఆర్యబాల సమాజ (స్థానిక గ్రంథాలయ) భవనమున కూడెను. దీనికి రెండువ్యాసములు మాత్రము వచ్చెను. గ్రంథాలయ ప్రబోధగీతముతో పాటీ రెంటిని శ్రీ పాతూరి నాగభూషణం గారే చదివిరి. ఆంగ్లవ్యాసముయొక్క సారాంశము తెలుగులో చెప్పబడెను. అనంతర మధ్యక్షులు పుస్తకమును చదువు విధమును తమ యుపన్యాసములో వివరించిరి.

| వ్యాసము | కర్త |
| --- | --- |
| 1. గ్రంథాలయములు: పుస్తకముల సరిచూచుట | శ్రీ పాతూరి నాగభూషణంగారు డిప్. లిబ్. |
| 2. Techniques in Library Service (గ్రంథాలయ సేవ : శాస్త్రపద్ధతులు) | శ్రీ యస్. శేషగిరిరావుగారు బి. యస్. సి., డిప్. యల్. యస్. |

## ప్రదర్శనము

28—5—42 వ తేదీ ఉదయం 9 గంటలకు గ్రంథాలయ ప్రదర్శనమును మాజీ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ మాగంటి బాపినీడు ఎం. ఎస్. సి. గారు తెరచిరి. ఈ సందర్భమున వీరు గావించిన ప్రసంగములో భారతదేశమునను, విదేశములందును తమకు గల అనుభవములను, ప్రదర్శనముల ప్రయోజనములను వివరించిరి. గ్రంథాలయోద్యమానికి సంబంధించిన మరికొన్ని యంశముల కూడ వీరు చెప్పిరి. ఈ ప్రదర్శనము సభ జరుగు ప్రదేశమున కెదురుగా నున్న శ్రీ పాటిబండ్ల శివరామకృష్ణయ్యగారి భవన సౌధోపరిభాగమున నేర్పాటు చేయబడెను. ఇందు వివిధ శాఖలుండెను. బాలశాఖ, వయోజన విద్యాశాఖ చూపరుల దృష్టి నెక్కువగ నాకర్షించెను. శ్రీ మోటూరి సత్యనారాయణగారు భారతదేశముయొక్క వివిధ భాషలలో ప్రచురింపబడిన బాల వాఙ్మయమును ప్రదర్శనము నిమిత్తము కొనివచ్చుటయేగాక వివిధ ప్రాంతములలో నీ విషయమై జరుగుచున్న కృషిని వివరించి ప్రదర్శనమును ప్రయోజనవంతము గావించిరి. కన్నడభాషలో ప్రచురింపబడిన 'బాలవిజ్ఞానము' అను పత్రమును చూపి దాని విశేషములను దర్శకులకు చెప్పిరి. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు పెద్దల విద్యకు సంబంధించిన వ్రాత పటములను చూపి తెలుగులోనున్న డాక్టరు లాబక్ గారి పటములోని విశేషములను లోపములను వివరించి చెప్పిరి. మదరాసు కార్పొరేషను వారు వయోజనవిద్యా బోధకులను తయారుచేయుట కేర్పాటుచేసిన తరగతులకు తాము పాఠములు చెప్పినప్పుడు కలిగిన యనుభవము ననుసరించి పై పటములో చేయవలసిన మార్పులను, చేర్చవలసిన కూర్పులను సూచించిరి. అట్టకట్టు (బైండింగు) విభాగములో వేరువేరు రకముల కుట్టులు, అట్టకట్టు పద్ధతులు ప్రత్యక్షముగ చూపబడెను. వివిధరకముల అట్టలుగల పుస్తకములును నిందు ప్రదర్శింపబడెను. గ్రంథాలయ విభాగములో మద్రాసు-ఆంధ్రదేశగ్రంథాలయ సంఘముల ప్రచురణలు,

కొన్ని పటములు, పత్రికలు, నివేదికలు ప్రదర్శింపబడెను. హిందూపురము మునిసిపల్ లైబ్రరీ సూపర్వైజరు శ్రీ దు. కృష్ణయ్యగారు పంపిన వ్రాత గ్రంథాలయ సంచికలు, పుస్తకాల ఆల్బము ఈశాఖ కందమును సమకూర్చెను. ప్రదర్శన మధ్యభాగమున రక రకముల బొమ్మల పుస్తకాలు చూపరుల దృష్టి నాకర్షించునట్లున్నతముగ నుంచబడెను. గ్రంథాలయవిభాగమునకు పత్రికా విభాగమునకు మధ్య గోడవార్తాపత్రిక యొకటి వ్రేలాడగట్టబడెను. ఆధునిక గ్రంథవిభాగమున రావుసాహెబ్ గోటేటి జోగిరాజుగారి వ్యవసాయ శాస్త్ర గ్రంథములు, నమ్మాళ్వారుస్ ప్రచురణములు, తెనాలి వేంకట్రామాఅండ్‌కో వారు తెచ్చిన మతికొన్ని పుస్తకములు గలవు.

## ముగింపు

28 వ తేదీ సాయంత్రము 4 గంటలకు తిరిగి మహాసభ శ్రీ ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతను సమావేశమయ్యెను. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ పాలకవర్గమువారు నియమించిన ఉపసంఘుసభ్యులు తయారుచేసినట్టియు, వారి పరిశీలనకు లోనైన యితరుల తీర్మానములును చర్చకు వచ్చెను. మహాసభలో ప్రతిపాదింపబడిన తీర్మానములలో నొక్కటిమాత్ర ముపసంహరించుకొనబడెను. వచ్చే మహాసభ నిమిత్తము రాయలసీమనుండి వచ్చిన హిందూపురమువారి యాహ్వాన మంగీకరింపబడెను. అధ్యక్షుల యుపసంహార వాక్యములతోను, ఆహ్వానసంఘుకార్యదర్శి శ్రీ పుతుంబాక శ్రీరాములుగారు మహాసభాధ్యక్ష ప్రారంభకులకు, శాఖాసమావేశముల అధ్యక్షులకు, ప్రదర్శనావిష్కర్తలకు, వివిధప్రాంతములనుండి వ్యయప్రయాసలకోర్చి సభకేతెంచిన ప్రతినిధులకు, ప్రేక్షకులకు, ప్రదర్శనము నేర్పాటు చేయుటలో తోడుపడినవారికి, మహాసభ జయప్రదముగ జరుగుటకు తోడ్పడిన వివిధగ్రామములవారికి కృతజ్ఞతాపూర్వక నమస్కృతుల చెప్పుటతోను సభ సమాప్తమయ్యెను.

సభాంతమున ఛాయాపటము తీయబడెను. సాయంత్రము 6½ గంటలకు పెద్దలందఱు రేవేంద్రపాడు - నవ్యభారతి గురుకుల వార్షికోత్సవమున కాహ్వానింపబడినవారై బయలుదేరిపోయిరి.

# 7

# స్వాగతోపన్యాసము

## శ్రీ పుతుంబాక సీతారామయ్యగారు

మహాశయులారా!

భాగ్యవశమున మాయందు మొలతెంచిన వాంఛాంకుర మెట్టకేలకు దేవదేవుని కారుణ్యరసమునఁ బ్రోదినొంది, పెంపారి, పుష్పితమై, పరిమళించి మిమ్ముల మాకడ కాకర్షింపఁగాంచి నేఁడెంతయు సమ్మోదభరితుల మగుచున్నారము. మాకోర్కె సఫలమైనది. అభిలాషము ఫలవంతమగునాఁక నువ్విళ్లూరితిమి. కాని మీయాగమన ఫలమెల్లవారికి ననుభవ యోగ్యము గాఁదగునట్లు మిమ్ము నుపచరించెడు పట్టున మాకుఁ గొంత తడఁబాటునకు లోనుగాక తప్పదాయెను. ఒక్క మహాకార్యమును మున్నిడికొని కుతుకము డెందముల సందడింప మా పిలుపును ద్రోసివైవక మీరిచ్చోటికి రాఁగంటి మంతియే కాని, ప్రయాణ సౌకర్యమెంతయు లేక యెందును బ్రశస్తిఁ బడయక యెచటనో మాఱుమూల నొదిఁగి తలయెత్తనోపని యీ కుగ్రామమునకు మీ రేల విచ్చేసెదరు? అక్కఱ యెఱిఁగి, కర్తవ్యము పాటించి, వేఁడికాలపు వాఁడిమి లెక్కసేయక తమకముమెయి నేగుదెంచిన యభిజ్ఞు లిందఱు పెద్ద లిచ్చోట సమావిష్టులగుట మా కన్నులు విందుగుడుచుచున్నవి సుఁడీ! ఈ శుభముహూర్తమున నిందలి యాహ్వాన సమితి పక్షమునను, నేతద్గ్రామవాసుల పక్షమునను గేలుమోడ్చి హృదయపూర్వకమగు స్వాగతము మీ కర్పించుచున్నాఁడను.

అయ్యలారా! దవ్వుదాపుల యంతరమెంచక, యాయాసమొంది, యసురుసురై యనురాగభరమున నిత్తఱి మాతావునకు వేంచేసితిరి. నేఁడు మానిలయమున నతిథులరైతిరి. తారసిల్లిన యతిథి తనియకుండుట గృహమేధికి దోషావహముగదా! ఇప్పట్టున మా యాచరణము దూషితముగాక యుండఁ గాపాడికొను టెట్టులో యను భీతికిఁ బాల్పడియున్నాము. శుభకార్యమున వేడుకమెయి బంధుమిత్త్రుల రావించియు, వారల నుచితవైఖరి నాదరించి తృప్తిఁగొలుపు పట్టున సంభారలోపమునను, సమయస్ఫురణము లేకయుఁ గళవళపాటునఁ గర్తవ్యము పొంతఁబోవక దూషితులై వెల్లఁబోవుట యిల్లు గట్టి కాఁపురము సేయు పెక్కండ్ర కనుభూతమేయని మీకు నే విన్నవింపఁ బనిలేదు. ఇంచుక విచారింప మీయెడ మాకట్టి భయమునకు రవంతయు నెడము గానరాదు. అభము శుభమెఱుఁగని పామరకోటిపై విజ్ఞానకౌముది నలముఁజేసి తమోవ్యాప్తిం బాఱఁద్రోలుటగదా మీయభీష్టము. అగుటంబట్టి యెదిరి నలుపులు మీ కంటఁబడవనియు, ప్రమాదముననో, శక్తిలేమినో మావలన మీకుఁ గలుగఁబోవు నాయాసము సైఁపనోపుదురనియు, నమ్మికమెయిఁ, గొంత యూఱటఁ దాల్పఁగలము.

సుగుణవిలసితులారా! మీరు క్షమాశీలురే యగుదురు. మా లోటుపాటుల సవరింపఁ జాలుదు రనుటయే నిక్కము. మీయెడ సంశయాత్ములము గాము. అయిననేమి? అభ్యాగతుఁడు సాక్షాద్విష్ణువన్నారు గదా స్మృతికర్తలు. అతిథి దేవుఁడుగా జీవింపుమని గృహస్థుని శాసించినారుగదా వేదకాలపు ఋషిసార్వభౌములు. దొర

కొన్న యతిథి యేదినుసువాఁడేనియు, దేవుఁడువోలె నాదరణీయుఁడఁట. వేళపాటున గుమ్మము ద్రొక్కిన యల్పజీవియే పూజ్యతరుడన్నచో నిచ్చోటి యీ ప్రాజ్ఞపరిషత్తు నే విధానమున సంభావింపవలయునో తోఁపక మా డెందము లాందోళితములయ్యెడిని. మీ రొక్కరొక్కరు దయచేయ మీరాక నవలోకించి యెదురేగి యుచిత సపర్యలొసంగి మీ కాప్యాయనము గల్పించుటయం దప్రమత్తులమై మెలఁగుచుంటిమో లేదో ? మేము పరులమని యెంచకుఁడు. ఉదారచరితులకు వసుధయే కుటుంబముగద ! అదియుఁగాక యేక కార్యోద్యములమై సమావేశము నొందియున్న మీకును మాకును నివ్వేళ స్వపరభేదము పాటింపఁదగునే ? మాశక్తికొలఁది సమకూర్చిన పదార్థముల నెపుడేది వలయునో స్వాతంత్ర్యమున మీ యిచ్చవెంబడిఁ గైకొని సంతుష్టులైరేని మముఁ జరితార్థులఁ గావించెదరని నమ్ముచున్నాము. కృపాళువులు మీరలు మాకులేనివి తెమ్మనఁబోరు. అవిలే దిదిలేదని గోఁజాడరు. మాచేతఁగామి నెఁదుటారింపరు. అట్లయ్యు, దేశకాల పాత్రానుగుణముగా విశేషవిధిని మిమ్ములఁ బూజింపక తీఱదను తహతహ యెంతయు మమ్ముల నుఱ్ఱూఁతలూఁపక మానదాయెను.

నాగరిక వయస్యులారా ! ఈవేసంగిబెట్ట మీ కెంతయు నోర్వరానిది. రాకపోకల కనువుగానిది. వడగాడ్పులీ చెవినుండి యాచెవి దుస్సి పోవుచున్నవి. అది యటులుండ నిండు. తన రంగభూమి నానాఁటికి నపరిమేయ వైశాల్యము వహింప సంగ్రామ దేవత మిన్నుముట్టి యోజన శతముల మేరకు రక్తజటాచ్ఛటలు విదిర్చి విధివిరామములు మీఱి ఫూత్కరించి యగ్నిగోళ పరంపర లుమియుచు నాలుకసారించి పారావార మేదినీభాగములు తడవి తడవి చప్పరించుచు విలయతాండవ పారవశ్యముతోడి యట్టహాసమున నపూర్వభీభత్సరసము వెల్లిగొలుపుచున్నను, బెగడువడక వెనుకముందాడక దూరము జనుదెంచితిరి. ఎంతయు బడలిక నొందితిరి. సుడిఁబడితిరి. ఆఁకొంటిరి. మిమ్ముల సేదదేర్చుట మాధర్మము. గ్రామవాసులము. అధునాతనాతిథ్య మర్యాదలెఱుఁగనివారము. వివిధములగు నభిరుచులఁబట్టి భోజ్యపానీయముల గల్పింప నేర్పుచాలనివారము. పలుతెగలకూరలు సమకూర్పఁజాల మైతిమి. వ్యంజనము లొకటి రెండు దక్క వలసినయన్ని కావింపలేమైతిమి. ఈ ఋతువున పాఁడి కఱవగుటఁబట్టి పాలు పెరుఁగులు సైతము పెల్లుగాఁ గూర్ప నసమర్థులము. ఉన్నది ప్రేమతో నివేదించి సంతసము వడయుదమన్న, పాకసౌష్ఠవము కొంచెమేని కలదో లేదో ?

ఉదారులారా ! మాయందలి నిర్వ్యాజవాత్సల్యమున మాదోషములు భోగ్యములుగా గొందురని విశ్వసించువారమయ్యు, మీపై మాకుఁగల్గిన ప్రేమాతిరేకమునఁ బూజ్యులగు మీకు సపర్యలుగావించుపట్టున మాశక్తి చాలమికి నించుకయేని లజ్జింపక తప్పదు. మీకు సౌఖ్యముగూర్పలేమైతిమని పరితపింపక తీఱదు. ఏమిచేయఁగలము ? తీపారు సల్లాపమరందశీకరము లించుకించుక చిలుకరించి కొంతకుఁ గొంత యాప్యాయనము మేకొలుప యత్నించెదమన్న, నది దుష్కరము. సరసాలాపరచనలయందారితేరిన సభ్యశిఖామణులు మీరు; పల్లెపట్టునఁ గాఁపురము సేయుచు నాగరసహవాస

సాహచర్యములు కొఱవడియున్నవారము మేము; మాకును మధురభావలకు నెంతయో దూరము. ఇంక మిగిలియున్నది ప్రేమ యొక్కటి. అకలంకమగు ప్రేమమున మే మెవ్వరికినిఁ దీసిపోవువారముగాము. భక్తితో నర్పించు తులసీదళముఁ గైకొని భగవానుఁడు సంప్రీతుండై దాసవర్గము కోరికలీడేర్చు భంగిని, మాయొసఁగు నీరసాన్నము పరమాన్నముగా శుద్ధజలము సుధారసముగాఁ గృపాపారవశ్యమున మాలోనివారై, అరమరలేక సాపడి మాచరితము ధన్యముగాఁజేయఁ బ్రార్థించుచున్నారము.

సదస్యులార ! ఎంతయో దవ్వులనుండి వివిధ భూములవారలు మీర లఖిలాంధ్రదేశ గ్రంథాలయ సభాపర్వ కుతూహాలురై యేతెంచుటంబట్టి మా యీ పల్లెపట్టు పావనత్వమున విలసిల్లఁగలెనని మే మెంచుట యబ్బురముకాదు. ఇట్టితఱి, సభాసదులకు స్థానికచారిత్రము నెఱుకపఱచు టొకటి నేఁడు సంప్రదాయమైనట్లు తెలియుచున్నది.

## గ్రామచరిత్ర

శ్లాఘనీయమైన చరిత్రమేదియు మా గ్రామమునకు లేదని మనవి చేయుచున్నాను. అయినను, అప్రసిద్ధమో, సుప్రసిద్ధమో యెచ్చోటి చరిత్రమేనియు తెలియఁగోరుట యిప్పటి విజ్ఞాన పరిశోధనాభిలాషుల కెల్లరకు సహజలక్షణమైనదిగావున తిట్టినో, మెట్టినో మా గ్రామచారిత్రము సహిత మించుక తెలుపఁబూనెద. ఈ యూరు ప్రాచీనమని చెప్ప వలనుపడదు. మున్నూఱేండ్లకు లోబడినదియే కాని అంతకు మించిన వయస్సీ యూరికి లేదని చెప్పవచ్చును. ఈ గ్రామమును మొదట స్థాపించినవారు నూతులపాటివారని ప్రతీతి. వారు కమ్మకులజులు. తరువాత, నొక తరము రెండుతరములు గడచిన పిమ్మట వారా - వారు ఎచ్చటినుండియో యీ పల్లెకు వచ్చి వాస మేర్పఱచుకొని యీ గ్రామ పరిసరములఁగల భూముల ముక్కాలు మువ్వీసము వారే సేద్యము చేయుచు మిక్కిలి సంపన్నులై పశువు ప్రతిష్ఠలతో కాలము పుచ్చుచుండిరఁట. వీరి యౌన్నత్యకాలములో గ్రామ సంస్థాపకులైన నూతులపాటివా రేకారణముననో సమీపముననున్న పేరుకలపూఁడికి తరలిపోయిరి. ఇట్లుండ ఒకటిన్నర శతాబ్దికి పూర్వము నిజాంరాష్ట్రములోనున్న గనియాత్మకూరినుండి యొక గొప్పవంశమునకుఁ జెందిన వాసిరెడ్డి పాపన్నగారను మహనీయు లొకరు వలస వచ్చిరఁట. ఆయన నిరంతర యోగనిష్ఠాపరుఁడై భగవద్భక్తితో కాలక్షేప మొనర్చుచు జీవికకై కొంత యల్పపరిమితిగల భూమిని సంపాదించి దానివలన జీవయాత్ర నెరపుచు నిచటనే స్థిరపడిపోయిరి. వీరే జపాల పాపన్నగారను సార్థక నామముతో వ్యవహరింపబడెడివారు. వీరికాలమునాటి కీగ్రామములో నన్నికులముల వారు కలసి యిరువదియిండ్లకంటె మించి లేవని తెలియుచున్నది. జపాల పాపన్నగారికి నైదవ, యాఱవ తరములవారే యిపుడీ గ్రామములోనున్న వాసిరెడ్డివారు. నాటినుండి సర్వవిధముల క్రమాభివృద్ధి నొందుచు తద్వంశీయులు భోగభాగ్యములతో తులఁదూగుచున్నారని తెలుపుట కెంతయు సంతసించుచున్నాను.

సుమారు నేఁటి కేఁబదిసంవత్సరములకుఁ బూర్వమువఱకు నీ గ్రామము వైద్య సాహాయ్యముగాని, విద్యాసాహాయ్యముగాని పరిసర గ్రామములనుండియే తగు ప్రతిఫలమిచ్చి పొందవలసివచ్చుచుండెడిది. ఇచ్చటికి సమీపముననే ఆగ్నేయదిశను అర మైలు దూరమున చినపాలెము గ్రామముకలదు. ఈ రెండును పూర్వమునుండియు ఏక గ్రామముగానే పరిగణింపఁబడుచున్నవి. ఒకప్పుడా గ్రామమే వరగ్రామముగానుండి దానికిది శివారుగా నుండెడిది. కొంతకాలముక్రిందట నిదియే వరగ్రామముగా మాఱినది. ఈ రెండుగ్రామములు మొదటనుండి అన్నివిషయములలోను దాదాపు సమాన స్థితిలోనే యుండుచు వచ్చుచున్నవి. నాఁటనుండి నేఁటిదనుక ఒకదానికొకటి యెల్ల విషయములలోను చేదోడువాఁదోడుగ మెలఁగుచున్నవి.

మొదటనుండి సాధారణ విద్యయేగాని, పాండిత్యగరిమ గల వారెవ్వరును నీ గ్రామమున లేరు. నిరక్షరాస్యుల సంఖ్యయు తక్కువయే. పరిసరగ్రామముల నెద్దాని నుండియైన నొక బ్రాహ్మణోపాధ్యాయుడు వచ్చి యే గృహస్థుని ముంగిటిచావడిలోనో చిన్నపాఠశాల నొకదాని నుంచుటయు, తన్మూలమున నిచటి బాలురు విద్యగఱచుచుండుటయు జరుగుచుండెడిది. ఇట్టిపాఠశాలయే యించుమించరువది సంవత్సరముల క్రింద గ్రాంటుస్కూలుగ మాఱియుండెను. ఈ గ్రామములోని విద్యావ్యాపన మీ స్థితిలోనుండఁగ 1905 వ సంవత్సరములో అప్పటి పిన్నవయస్కులు ఇరువదేండ్లకు లోపడినవారు కొందఱుచేరి, తాము నేర్చిన యల్పవిద్య నభివృద్ధిపఱచికొనుటకును, కొంత లోకజ్ఞాన మలవఱచికొనుటకును, బుద్ధిపొడమి చిన్న గ్రంథాలయమును నెల కొల్పికొనిరి. ఆ గ్రంథాగారస్థాపకులెల్లరు గలసి బాలసమాజమను పేర నొక సంఘముగా నేర్పడి గ్రంథమందిరము మంచిచెట్టుల నరయుచు, కొంత విజ్ఞానలాభము నొందఁగడంగిరి. ఇప్పటి యీ గ్రంథాలయస్థాపన ప్రబోధము లప్పుడులేవు. కొన్నిపుస్తకము లొకచిన్న పేటికలో నుంచుకొని, వలసిన పాత్రముల నిండ్లకు తీసికొనిపోవుచును, అడిగినచో సాంఘికేతరులకైన నొసఁగుచును, తమ యోపినకొలఁది స్వలాభ పరలాభములకుఁ గృషి సలుపుచుండెడివారు. నాఁడు ప్రచారములోనున్న శశిరేఖ, ఆంధ్రప్రకాశిక, దేశాభిమాని, కృష్ణాపత్రికయను నీ తెలుఁగుపత్రికలును, సరస్వతి మున్నగు సాహిత్యవిషయిక మాసపత్రికలును తెప్పించి చదువుటయు, వినుపించుటయు జరుగుచుండెడిది.

అది వంగదేశవిభజన విషయికాందోళన సమయము. రష్యా — జపానులకు యుద్ధము జరుగుచున్న కాలము. కావున, సమాజస్థాపనారంభదినములలో వార్తాపత్రికలయం దభిరుచిగలవారలకీ గ్రంథాగారము కొంత యాకర్షకమై యొప్పినది. ఇంతలో వంగదేశవిభజనము రద్దుగావించు పూనికతో వందేమాతరోద్యమము బయలుదేరినది. ఆసందర్భమున స్వదేశవస్తుస్వీకారదీక్షకు నాఁటిగ్రంథాలయ మొక సాధనమయ్యెనని చెప్పకతప్పదు. మొట్టమొదట బాలురచే స్థాపింపబడినదయ్యు పిన్న పెద్దలెల్లరకు క్రమముగా నుపయుక్తమగుటవలన బాలసమాజము ఆర్య బాలసమాజముగా

వ్యవహరింపఁబడెను. అంత దీనికొక సొంతమందిరముకూడ గ్రామస్థులసాహాయ్యమున నిర్మింపబడెను.

ఈ సమాజస్థాపనకు పిమ్మట రెండు, మూఁడు మాసములకే చేబ్రోలునుండి వచ్చి యిచ్చట నివసించుచున్న బ్రహ్మచారి శ్రీ వాసిరెడ్డి వెంకటనరసింహదాసుగారను భాగవతశిరోమణి ఈగ్రామస్థుల సాహాయ్యసంపత్తితో దేవాలయమునకు శంకు స్థాపనచేయించిరి. అయ్యది 1907 వ సంవత్సరమునకు పూర్తికావింపఁబడి అందు శ్రీ కోదండరామస్వామివారి ప్రతిష్ఠ జరిగెను. ఆ మహాపురుషుని తోడ్పాటిచటి గ్రంథాలయమునకు మిక్కుటముగా లభించెను. ఇచట తలయెత్తిన యే చిన్న పెద్ద యుద్యమములకేని, ఆయన చేయూఁత లేకయుండెడిది కాదు. మా దౌర్భాగ్యవశమున సరిగా సంవత్సరముక్రిందట అమ్మహనీయుఁడు పరమపదము వేంచేసినని తెలుపుట కెంతయు దుఃఖించుచున్నాఁడను.

ఇట్లు గ్రంథమందిర, దేవమందిర కార్యకలాపములు కొంత సంతృప్తికరముగా జరుగుచుండ, సనాతనధర్మానుయాయులై కాలానుగుణ సంఘసంస్కరణాభిలాష గలిగిన యిచటి కొందఱిసానుభూతి సహకారాదులతో మంగళగిరి వాస్తవ్యులగు శ్రీయుతులు నల్లపాటి హనుమంతరావుగారు హరిజనులయుద్ధరణకై శ్రీకృష్ణాశ్రమ మను పేర నొకపాఠశాల నెలకొల్పి దాదాపు పదివత్సరములు కొనియాడఁదగిన రీతిని తనుమానసముల నర్పించి యెంతయో సాంఘికసేవ సల్పియుండిరి. ఈయాశ్రమ మెచటనే నొకపట్టణమున నున్నచో నభివృద్ధి కెక్కువసాధనసంపత్తులు లభించునను నాసగొని యీమండలమునకు ప్రధాననగరమగు గుంటూరికి మార్పఁబడినది.

ఇదియుఁగాక యీగ్రామమందలి యుదారులును, ధనికులును నగు వారి సాహాయ్యమున శ్రీ వేంకటాద్రి నాయని ప్రాథమికోన్నత పాఠశాల యను నొక విద్యాసంస్థ యేర్పడినది. ఈపాఠశాలకు చెంతనున్న చినపాలెపువారి ధనసాహాయముకూడ లభియించినది. అందుల కెంతయు కృతజ్ఞులము. ఆ పాఠశాల యొకసంవత్సరము గడచిన తరువాత గాంధిమహాత్ముని యప్పటి రాజకీయ ధర్మసూత్రము ననుసరించి ప్రభుత్వ సహాయము నిరాకరించి జాతీయవిద్యాలయముగా మార్పునొందెను. ఆదేసమయమున శ్రీకృష్ణాశ్రమ పాఠశాల సహితము జాతీయసంస్థగా మాఱినది. ప్రభుత్వ సాహాయ్యమును నిరాకరించుటం బట్టియును, స్థాపనమునకు తరువాత నితరులనుండి ధనాదికము లభింపమిం బట్టియు నడపుట దుస్తరము కాఁగా పాఠశాల నెత్తివేయవలసి వచ్చెను. ఈకాలముననే గ్రంథాలయ భవనము శిథిలమగుటంజేసి పుస్తకముల బీరువాలు వేఱొక చోట భద్రపరుపబడినవి.

ఈలోపల నీ గ్రామమునకును, చుట్టుపట్టుల గ్రామములకును వివిధరూపముల సేవసల్పు గాఢకుతూహలమున గ్రామములోని వ్యక్తులు కొద్దిమంది సేవాశ్రమమును స్థాపించిరి. ఈ ఆశ్రమద్వారమున గ్రామమునను, చుట్టుపట్లను జాతీయతా ప్రచారము జరుపఁబడి యీ సంస్థ సహృదయుల సంతృప్తికిఁ బాత్రమయ్యెను. ఈ సేవా

# అధ్యక్షోపన్యాసము

శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్.

ఆదికాలములో ప్రపంచానికంతా మొట్టమొదట జ్ఞానభిక్ష పెట్టినవారు ఆర్యులు (హిందువులు) కల్డూలు (ఖాల్డియనులు) బాబిలీలు (బాబిలోనియనులు) అసురులు (అసీరియనులు) ఖేటులు (ఖిట్టి; హట్టి హిట్టయిటులు) ఫణికులు (ఫనీకియనులు) మిశ్రులు (ఈజిప్టువారు) చీనులు-వీరుతప్ప ఇతరజాతులు ఈసందర్భములో కానరారు.

గ్రీకులు లిపిని, నౌకావిద్యను ఫణికులనుండి నేర్చుకొనిరి.

ఈరానీలు (పారసీకులు) వైదికార్యులనుండి విద్యల నేర్చిరి.

ప్రాచీనమందు బండలు, గుండ్లు, లోహములు, ఇటికెలు, గోడలు, స్తంభాలు, కట్టెపలకలు, చెట్లనారలతో సిద్ధమైనపటములు, భూర్జములు, తాటియాకులు, చర్మములు, వ్రాతకు సాధనములై యుండెను.

కల్దూ [ఖాల్డియా] దేశమందు పచ్చిఇటికలపై గంటములవంటి లేఖినులతో వ్రాతవ్రాసి వాటినికాల్చి భద్రపరచుచుండిరి. క్రీ. పూ. ౩౪౦౦ నాడు ఖాల్డియాను ప్రథమసర్గాన్ అను రాజుపాలించెను. అతడు ఇటికగ్రంథాలను సేకరించి సొంత గ్రంథాలయమును స్థాపించియుండెను. ప్రపంచమందు ఇంతకన్న పూర్వముండిన గ్రంథాలయము మనకింతవరకు కానరాలేదు. ఈజిప్టుదేశమందు క్రీ. పూ. ౪౦౦౦ ఏండ్లకంటే ముందుగానే లిపి ఏర్పడెను. వారినుండి ఫణికులు వ్రాయుట నేర్చుకొనిరి. ఫణికులనుండి గ్రీకులు నేర్చుకొనిరి. ఆలిపిభేదమే యిప్పుడు యూరోపుఖండమందంతటను వ్యాపించియున్నది.

ఋగ్వేదమందు వాక్కును, చూచుటను, వినుటను వర్ణించినారు. అనగా ఋగ్వేదకాలమునకు పూర్వమే వైదికార్యులు లిపిని ఎరిగియుండిరి. క్రీ. పూ. ౨౪౦౦ ఏండ్లకు పూర్వమే ఆర్యులు లిపిని ఎరిగియుండిరని కౌంట్ జోర్నుజెర్నా (Bjorsjerna) గారు వ్రాసిరి. మోహన్‌జోదారోలో అతిప్రాచీనవస్తువులు బయలుపడినవి. అందు లిపికల ఫలకములు చాలాదొరికినవి. ఆలిపిని ఇంతవరకు చదువలేకున్నారు. ఊహాలుచేయుచున్నారు. ఇంకా బహుపరిశోధనల తర్వాత అది సాధింపబడునేమో. మోహన్‌జోదారో క్రీ. పూ. ౩౦౦౦ ఏండ్లనాటిదనియు, మరికొందరు క్రీ. పూ. ౪౦౦౦ ఏండ్లనాటిదనియు అభిప్రాయపడుచున్నారు. అక్కడులు (అగదె లేక అక్కేడియాదేశమువారు) ఆర్యశాఖవారు-వారినుండియే ఖాల్డియావారు లిపిని నేర్చుకొనిరందురు- ఇదంతయు ౫౦౦౦ ఏండ్లకన్న పూర్వపుముచ్చట.

క్రీ. పూ. ౬౫౦ ఏండ్లక్రిందట అసీరియాలో అసురబనిపాల అను రాజు రాజ్యముచేసెను. అతడు వేనవేల ఇటికగ్రంథాలను వ్రాయించెను. తన రాజ్యమందన్ని ప్రాంతములకును పండితుల బంపించి గ్రంథముల సేకరించెను. ప్రాచీనకాలములో ఇంతటి మహోన్నతగ్రంథాలయము ప్రపంచమందు మరెచ్చటను కానరాలేదు. ఏషియా

14A

# ౨౩ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## పెదపాలెము



అధ్యక్షులు

శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్.



ఆహ్వాన సంఘాధ్యక్షులు
శ్రీ పుతుంబాక సీతారామయ్యగారు



ప్రారంభకులు
శ్రీ కె. వేంకటస్వామినాయుడుగారు, బి. ఏ., బి. ఎల్.

మైనరులోని మైసియా అను దేశమునకు ముఖ్యపట్టణమైన పర్గామస్ అను పట్టణములో రెండులక్షల లిఖితగ్రంథములుకల గ్రంథాలయ మ్ముండెను. ఇది క్రీ. పూ. ౫వ శతాబ్దమునాటి మాట.

తక్షశిల, నలందావిద్యాపీఠములందలి గ్రంథాలయములను గురించి విద్యావంతులందరును ఎరిగియేయున్నారు. నలందాలో తొమ్మిదిఅంతస్థుల దేవాలయముండెను. అందలి గ్రంథాలయమును "ధర్మగంజ" అని వ్యవహరించిరి. ఓదంతపురివిహారములో వేలకొలది హిందూ బౌద్ధ గ్రంథము లుండెను. కర్నూలుజిల్లాలోని శ్రీశైలమందు పర్వతసంఘారామములో నొక గొప్ప గ్రంథాలయ ముండెను. జగద్విఖ్యాత ప్రాచీనాంధ్రుడగు నాగార్జునుడు తన యవసానకాలమం దచటనే నివసించెను. కాకతీయ గణపతి రుద్రదేవుని కాలములోని శైవమఠములే విద్యావ్యాపకస్థానములైయుండెను. ఆమఠాధిపతులు 3 లక్షల గ్రామాలలో విద్యావ్యాపకముచేసిరట. బొంబాయి రాజధానిలోని కన్హేరీగుహాలలో బుద్ధసంఘానికి గ్రంథములను కొనుటకై దానములు చేసినట్లు శాసనములు చెప్పుచున్నవి. అదేవిధముగా వలభిలో ఒక విద్యామఠముండెను. అందు గ్రంథములుంచి గ్రంథాలయములను నడుపుటకై దానాలిచ్చుచుండిరి.

చీనాదేశమువారు విద్యాప్రియులు. వారి పూర్వరాజులు అనేకగ్రంథములను దేశమందు వ్యాపింపజేసిరి. హిందూస్థానమునకు మొట్టమొదట చీనాయాత్రికుడగు ఫాహియెన్ క్రీ. శ. 3౯౯లో వచ్చెను. పాదచారియై వేలమైళ్లు ప్రయాణముచేసి హిందూస్థానమునుండి నూర్లకొలది గ్రంథములను తనదేశమునకు తీసుకొనిపోయెను. మనదేశమునుండియు చీనాకు పండితులు వెళ్లుచుండిరి. అందు సుప్రసిద్ధుడైనవాడు కుమారజీవుడు, అతనికాలమందు చీనాలోని చక్రవర్తి కుమారజీవుడు తనదేశానికి మంచిమాటలతో రాడని తెలిసి క్రీ. శ. 3౮౩ లో ౭,౦౦౦ చీనాసైన్యమును సిద్ధముచేసి అతనిని పట్టుకొనిరావలసినదని ఆజ్ఞాపించెను! ఇది బలీయమైన సరసత. కాని బలవంతమునకు విద్వత్తు విముఖత చూపును. ఆ చీనాచక్రవర్తి క్రీ. శ. 3౮౮లో చనిపోయినతర్వాత చీనీలప్రార్థనపై కుమారజీవుడు చీనాకువెళ్ళెను. అతడు సంస్కృత పాలీభాషలనుండి అనేకగ్రంథములను చీనాభాషలోనికి పరివర్తన చేసెను. అతడు చీనాలో 3౦ ఏండ్లు నివసించి అందే చనిపోయెను. అతనికి దహనక్రియలు చేయగా శరీరమంతయు భస్మమయ్యెను- కాని నాలుకమాత్రము కాలనేలేదట! అతనిశక్తిలో చీనీల కంతటి గాఢభక్తి యుండెనన్నమాట. క్రీ. శ. ఏడవశతాబ్దములో ఇత్సింగు అను మరొక చీనాయాత్రికుడు హిందూస్థానమందు సంచారముచేసి నూర్లకొలది గ్రంథాలను తీసుకొని సుమత్రా జవాద్వీపాలకు వెళ్లెను. జావా ద్వీపములో తాను భారతదేశమునుండి తీసుకొనివెళ్ళిన గ్రంథములప్రతులు చాలావరకు దొరికెనట! ఇట్టి గ్రంథాలను ఇత్సింగు సమర్థులచే చీనాభాషలోనికి పరివర్తన చేయించెను. హిందువులు జావాలో ఎంత పూర్తిగా తమమతమును, వాఙ్మయమును, ఆచారములనువ్యాపింపజేసిరో దీనివలన విశదమగుచున్నది. నేటికిని ఈజాడలు జావాలో కనిపించుచున్నవి.

మించు మిగిలినవన్నీ కాల్చివేయబడెను. క్రైస్తవమతమునకు భిన్నించిన గ్రంథాలుండ కూడదనియే వారిపట్టింపు. మెసడోనియారాజగు అలెగ్జాండరు జగద్విజేత అని ప్రఖ్యాతికాంచినాడు. అతని ఘనతను చరిత్రకారులు పొగడుచుందురు. కాని నిజముగా అతడు కామి, మహాక్రూరుడు. ముక్కోపి. ఇంచుమించు సప్తవ్యసనాలన్నింటిలో తగులుకొన్నవాడు. అతడు ఈరాన్‌లోని మాగీజాతిని చాలా హింసించెను. వారి దేవాలయములను పడగొట్టించెను. వారి గ్రంథాలనన్నింటిని వెతకించి తెప్పించి కాల్పించెను. క్రీ. పూ. ౨౨౧లో చీనాదేశమును "చీన్" వంశపురాజు ఆక్రమించుకొనెను. తనకన్న పూర్వములో వుండిన గ్రంథాలనన్నిటిని అతడు కాల్పించెను. క్రీ. శ. ౧౨౧౨ లో బఖ్తియార్ ఖిల్జీ సేనానియగు మహ్మదు బిన్ సాం అను నతడు ఓదంతపుర మందలి గ్రంథాలనన్నింటిని కాల్చివేసెను. అన్‌హల్వాడా పట్టణములోని ప్రసిద్ధ గ్రంథాలయమును అల్లావుద్దీన్ ఖిల్జీ కాల్చివేసెను. "కోహాన"అను పట్నములోని సంస్కృతగ్రంథాలను ఫీరోజుషాతోగ్లాకు కాల్చివేసెను. హిందువుల పుస్తకాలు ఎక్కడకనబడితే అక్కడ వాటిని ఔరంగజేబు కాల్పించుచుండెనని సయ్యదుగులాం హుసేన్ అనునతడు తన సైరుల్ ముతఖయ్యరీన్ అను గ్రంథములో వ్రాసెను. చిత్తోడ్ పతనమైనప్పుడు అందలి పుస్తకాలనన్నింటిని ముసల్మానువిజేతలు లూటీచేసుకొని వెళ్లిరి. టిప్పూ పతనానంతరము అతని గ్రంథాలయము ఇంగ్లీషువారి వశమయ్యెను. ౧౮౫౭ నాటి సిపాయివిప్లవములో ఔధ్ నవాబు గ్రంథాలు తుపాకిగుండ్లచే నాశము కాగా మిగిలినవి సోల్జర్ల తేనీటికి ఇంధనములయ్యెను. ఈవిధముగా అందందు సర్వకాలము లందును గ్రంథములను అత్యంతభక్తితో సమకూర్చువారుండగా మహాక్రోధముతో వాటిని నాశనముచేసి విజ్ఞానమునకు తీరని నష్టమును కలిగించినవారును ఉండిరి.

ఇదంతయు ప్రాతకాలపు ముచ్చట. ఇప్పుడు అమెరికా యూరోపు దేశాలదే పుస్తకపోషణములో పైచేయి. అచ్చు వృద్ధియైన తర్వాత గ్రంథాలయ ప్రాముఖ్యతయు ఎక్కువయ్యెను. లండన్, ప్యారిస్, బర్లిన్, బోస్టన్, మాస్కోవంటి నగరాల లోని ప్రజాహిత గ్రంథాలయములలో ఒక్కొక్కదానియందు ౩౦ లక్షలనుండి ౧ కోటివరకు గ్రంథాలున్నవని చెప్పుదురు. అమెరికాలో హెన్రీకార్నీజీ అను మహాదాత ఇంచుమించు ౭ కోట్ల రూపాయీలను గ్రంథాలయాలకును, విద్యాసంస్థలకును దానముచేసెను. హిందూస్థానములో ౨ లక్షలకన్న మించిన గ్రంథాలుగల ఒక గ్రంథాలయముకూడా లేదు. బరోడాసంస్థానము గ్రంథాలయోద్యమములో అగ్రస్థానము వహించినది. రెండవస్థానము ఆంధ్రరాష్ట్రమునకు చెందినదని ప్రతీతి. హైద్రాబాదురాష్ట్రములో ౨౦ ఏండ్లనుండియు ఈ యుద్యమము సాగుచున్నది. రెండుమూడు గ్రంథాలయములు ౪౦ ఏండ్లకు ముందునుండి నేటివరకు నడుపబడుచున్నవి. మొదటమొదట ౧౦౦ గ్రంథాలయములు మించియుండెను. ఇప్పుడందు ౩౦ వరకైనా నశించినట్లు తెలియవచ్చుచున్నది. తక్కినవైనను సరిగా సాగుటలేదు- పట్టమని పది గ్రంథాలయములవరకు సొంతభవనములు కలిగి అవిచ్ఛిన్నముగా సాగుచున్నవి. ఆంధ్రులు స్థాపించిన తెలంగాణా గ్రంథాలయములలో నెల్ల ప్రాచీనమైనవి

వరంగలులోని రాజరాజనరేంద్ర గ్రంథాలయమున్నూ, హైదరాబాదులోని శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయమున్నూ. ప్రసిద్ధికి వచ్చిన దీరెండవదే. ఏమిన్నీ ప్రకటనలేకుండా ౧౦,౦౦౦ ఇంగ్లీషు తెలుగు ఉర్దూభాషలలో గ్రంథములను సమకూర్చినది హైద్రాబాదునగరమందలి రెడ్డిగ్రంథాలయము. హైద్రాబాదులో ఆంధ్రులవి కాకున్నను పేర్కొనదగిన గ్రంథాలయములు కొన్నికలవు. అందొకటి ప్రభుత్వమువారు స్థాపించిన ఆసఫియాలైబ్రరీ- దాని స్వర్ణోత్సవము రెండుమూడు నెలలక్రిందటనే జరుపబడెను. అందు ౫౦,౦౦౦ వరకు గ్రంథాలు కలవు. విశేషముగా ఉర్దూ ఇంగ్లీషు గ్రంథాలుకలవు. తెనుగు మరాటీ కన్నడ సంస్కృత భాషలలో ఒక గ్రంథముకూడా లేదనవచ్చును. వివిధ ప్రజాసభలలో ఈ ౨౦ ఏండ్లనుండియు పై భాషలలో గ్రంథాలను తెప్పించి పై ప్రభుత్వ గ్రంథాలయములో నుంచుటకై తీర్మానించుచూ వచ్చినారు. ఇంతవరకు కోరిక ఫలించలేదు. హైద్రాబాదునగరములో రెండు ప్రైవేటు (సొంత) గ్రంథాలయము లున్నవి. ఒకటి నవాబు సాలార్జంగుబహద్దరుగారి గ్రంథాలయము. ఇందు ఉర్దూ ఫార్సీ అరబ్బీ వ్రాతపుస్తకములు ఎన్నికలవో లెక్కింపలేదుకాని అవి యుంచబడిన బీరువాలు మాత్రము ఇంచుమించు ౩౯ ఉన్నట్లు నాకు జ్ఞాపకము. మరి ముద్రితాంగ్ల గ్రంథములు ౧౦ వేలవరకున్నవి- పైగా నవాబుగారు అద్వితీయులగు కళారాధకులు. లక్షలు వ్యయముచేసి వేలకొలది ప్రాచీన చిత్రములు, ఖడ్గములు, అరుదగు వస్తువులు సేకరించినారు. నవాబుగా రొకమారు లండన్ మ్యూజియమును దర్శించుకొనగా అక్కడి పాలకుడు వారి నివాసస్థానము మాత్రము విచారించుకొని 'అట్లైతే మీరు సాలార్జంగుగారు సేకరించినవాటిని చూచియుందురు- అటుపై దీనిని చూచే అవసరమేమున్నది ?' అని అన్నాడట ! రెండవ గ్రంథాలయము రాజా శ్యామరాజబహద్దరువారిది. వారును పై నవాబుగారివలెనే ముద్రితాముద్రిత గ్రంథాలను కూర్చువారును, చిత్రములను తదితర కళావస్తువులను కొనువారును నైయున్నారు. వారివద్ద కూడ ౧౦,౦౦౦ కు మించిన గ్రంథాలున్నవి.

ఆంధ్రోద్యమము తెలంగానాలో గ్రంథాలయోద్యమముతో ప్రారంభమయ్యెను. గ్రంథాలయ సభలే మొదటికాలములో భాషా సాంఘిక రాజకీయ సభలుగా ఉండెను. తర్వాత "నిజాంరాష్ట్ర మహాసభ" అను పేరుతో ౧౫ ఏండ్ల క్రిందట స్థాపితమయ్యెను; నాటినుండి గ్రంథాలయములు వేరుపడెను. ఇప్పుడవి శుద్ధ భాషా సంస్కృతివాదుల పాలిట పడినవని తలపవచ్చును.

ఈ మద్రాసురాజధానిలో చేరిన ఆంధ్రజిల్లాలలోని గ్రంథాలయోద్యమము తెలియవచ్చినంతవరకు ప్రశంసనీయముగా సాగుచున్నది. ఆంధ్రదేశములో ౨౬ ఏండ్ల క్రిందట గ్రంథాలయసంఘము స్థాపితమై ఆనాటినుండియు పనిచేయుచున్నది. గ్రామ గ్రంథాలయములను ఆంధ్రదేశమందే మొదట స్థాపించినట్లు కానవచ్చుచున్నది. అంతే కాదు బరోడా సంస్థానంలోవలె సంచార గ్రంథాలయములనుగూడా నడుపుచున్నారు.

గ్రంథాలయములు కేవలము గ్రంథసంపాదనముతో తృప్తిపడగూడదు. పల్లెటూరి గ్రంథాలయములను నడుపువారిలో చాలమందికి ఏగ్రంథాలు మంచివో ఏవి తెప్పించవలెనో సరిగా తెలియదు. మన గ్రంథాలయములో ఉండదగిన మంచిగ్రంథాల పట్టికను వాటివివరణను తెలుపుచు ఒక లఘుపుస్తకమును ప్రకటించవలెను. మనదేశమందు విద్య వచ్చినవారి సంఖ్య నూటికి ౧౪ వరకున్నది. మా హైద్రాబాదు రాష్ట్రములో నూటికి ౭ మందికిలోగానే అక్షరాస్యులై యున్నారు. అందులోనూ హిందువులసంఖ్య మరీతక్కువ. వారిలో ఆంధ్రులసంఖ్య ఎట్టిదో ఇంతవరకు తెలియరాదయ్యెను. ఇట్టి అల్పసంఖ్య గ్రంథాలయోద్యమమునకు ప్రబలనిరోధకమై యున్నది. గ్రంథాలయమనగా ఒక భాషాసేవ అనిమాత్రమే తలచుటవలన నష్టముకలుగును. మనపూర్వులు ఆవిధముగా ఆలోచించినవారు కారు. ఋష్యాశ్రమములలో బ్రహ్మచారులకు శబ్దజ్ఞానము మాత్రమే కలుగువిద్యను చెప్పినవారుకారు. విద్యార్థుల నైతికశక్తికి సంఘసేవాశక్తికి మతభక్తికి తోడ్పడుచుండిరి. దేవాలయములు నిర్మించినప్పుడు వాటిని పూజకుమాత్రమే ప్రత్యేకించి యుండలేదు. వాటి ఆవరణాలలో సత్రములుకట్టి పరదేశులకు సౌకర్యముకల్గించిరి. బళ్ళను పెట్టి విద్యచెప్పించిరి. దేవాలయమందే గ్రామసభలను పంచాయతీ తీర్పులను చేయుచుండిరి. పురాణశ్రవణానికి, హరికథలకు, పండుగల సమావేశములకు అవే ఆశ్రయములై యుండెను. అదేవిధముగా ఈనాడు గ్రంథాలయములు గ్రామజీవనమున కంతయు కేంద్రములుగా నుండవలయును. కొన్నిసంవత్సరములవరకు వయోజనవిద్యను ఉచితముగా నేర్పుటకు సిద్ధపడువారే గ్రంథాలయాధికారులుగా ఏర్పడుటమంచిది. వయోజనవిద్యతోబాటు గ్రామజనులలో ఆరోగ్యవిధులు, పరిశుభ్రత, సహకారము, పంచాయతీపద్ధతులు వ్యాపింపజేయవలెను. పత్రికాపఠనముద్వారా భూగోళము, చరిత్ర, మహాపురుషుల జీవితములు, విజ్ఞానశాస్త్రపద్ధతులు మున్నగునవి వారికి బోధింపవలెను. కొన్ని గ్రంథాలయములలో చిట్టిఆటలు (indoor games) ఏర్పాటుచేసినారు. వాటితోపాటు వ్యాయామశాలలను ప్రతి గ్రంథాలయమున కనుబంధముగా స్థాపింపవలెను.

ఈవిధముగా చేసినట్లయిన మనము అచిరకాలములోపలనే మన గ్రామములను అనుకొనునంతటి రీతిగా ఉద్ధరించినవార మగుదుము.

త్యాగములేనిది భోగములేదు. బలహీనదేశములను కబళించి వాటిని తమభోగాల కుపయోగపడునట్లుగా చేయుటకేకదా ప్రపంచమహాసంగ్రామము జరుగుచున్నది. పరులను దాసులనుగా బానిసలనుగా చేసికొనుటకై యుద్ధతులు ప్రాణాల నవలీలగా అర్పించుకొనుచున్నారు. ధనమును గంగాప్రవాహమువలె పారించి వ్యయముచేయుచున్నారు. శత్రువులనుండి ఆత్మరక్షణము చేసికొనుటలో తమదేశాలను తమపంటలను తమయావదాస్తిని తమవారధులను యంత్రాలయములను నూనెబావులను అన్నింటిని ధ్వంసము చేసికొనుచున్నారు. అట్టిత్యాగమును మనము చేయుచున్నామా? అందు శతసహస్రాంశమునకై మనము సిద్ధముగా ఉన్నామా? లేకున్న మనము ఈదుష్టకాల

ములో దేశదేశములను ముంచివేయు కాలప్రవాహములో కొట్టుకొనిపోక నిల ద్రొక్కుకొనగలమా? బాగా ఆలోచించండి. "వీరభోజ్యావసుంధరా" యని మన పెద్దలు చెప్పిపోయిరి.

ప్రతిదేశమందును కాలానుగుణ్యముగా నూతనసిద్ధాంతములు బయలుదేరు చున్నవి. కాలము ననుసరించి మనకు లాభకరమగునంతవరకు మనమును మార్పును చెందవలసియుండును. దీనిని గమనించియే శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులు ఇట్లు బోధించిరి.

"దేశేకాలే నిమిత్తేచ యోధర్మోభవతి
సఏవ దేశకాల నిమిత్తాంత రేష్వధర్మోభవతి"

ఇట్లు,
సురవరము ప్రతాపరెడ్డి
అధ్యక్షుడు

## తీర్మానములు

౧. గ్రంథాలయ సేవాధురీణులై తమజీవితము ధన్యము చేసికొని ఆంధ్రదేశ గ్రంథాలయ చరిత్రలో సుప్రసిద్ధస్థాన మలంకరించి స్వర్గస్థులైన శ్రీ చిల్లరిగె శ్రీనివాసరావు, సాగి వెంకటనరసింహము గార్ల మరణములకు ఈసభవారు చింతిల్లుచు వారి యాత్మకు ప్రశాంతి గోరుచు, వారికుటుంబములకు తమ సంతాపము తెలుపు చున్నారు.

౨. ఆంధ్రదేశ గ్రంథాల యోద్యమమునకు, విశేషించి నెల్లూరు మండల గ్రంథాల యోద్యమవ్యాప్తికి మిక్కిలిగా పాటుబడుచుండిన నెల్లూరు 'సుబోధినీ' పత్రికా సంపాదకులగు శ్రీమన్నేపల్లి రామకృష్ణ రావుగారు అకాలమరణము చెందినందుల కీసభవారు మిక్కిలి సంతాపమును వెలిబుచ్చు చున్నారు. వారికుటుంబమునకు సానుభూతి తెలుపుచున్నారు.

3. ఇప్పుడిప్పుడే మొలకెత్తుచున్న వయోజన విద్యాప్రచార మునకు ప్రభుత్వమువారు చేసిన నిషేధము దేశాభివృద్ధికి గొడ్డటిపెట్టు. కావున సర్కారువారు మరల నాలోచించి యీనిషేధమును ఉప సంహరించుకొనవలయునని యీసభవారు కోరుచున్నారు.

౮. మద్రాసు గవర్నమెంటువారు 1942–43 సం.కు కూడా గ్రంథాలయములకు ధనసహాయము చేయ నిశ్చయించుకొనినందుల కీసభవారు సంతసించు చున్నారు.

కాని, గవర్నమెంటువారు చేయు సహాయము మొత్తమునకు సమముగా గ్రంథాలయ నిర్వాహకులు ఖర్చుచేయవలెనను షరతు గ్రంథాలయములకు మిక్కిలి యిబ్బంది కలిగించుచున్నది. కాన యీ షరతు రద్దుచేయించవలయు ననియు, అట్లు షరతు పూర్తిగ రద్దుచేయు టకు వీలుకానియెడల గ్రంథాలయ నిర్వాహకులు చేయవలసిన ఖర్చు మొత్తము (ఇచ్చునట్టి గ్రాంటుకు సమానమైన మొత్తము) లో సం వత్సర ప్రారంభమునుండి గ్రంథాలయోప యోగమునకుగాను చేయ బడు వార్తాపత్రికల చందాలు – సిబ్బందీల జీతములు – సంపాదించిన పుస్తకముల వెల – బైండుఛార్జీలు – సాదరుఖర్చులు మొదలగు న్యాయమైన ఖర్చు పద్దులన్నియు చేర్చుకొనవలెననియు, యీసభ వారు గవర్నమెంటువారిని ప్రార్థించుచున్నారు.

౯. గ్రంథాలయములు స్థాపించుట, సక్రమముగ నిర్వహించుట మొదలగు గ్రంథాలయోద్యమ వ్యాప్తికిని, వయోజన విద్యావ్యాప్తి కిని విశేషముగ పాటుబడుచున్న ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము నకు కూడా గ్రంథాలయములకు వలెనే ధనసహాయము చేయవలెనని యీసభవారు మద్రాసు గవర్నమెంటు వారిని ప్రార్థించు చున్నారు.

౧౦. దేశములో వెయ్యి జనసంఖ్యకు మించిన గ్రామములలో నైనను సంచార రేడియోలను యేర్పాటుచేసి గ్రంథాలయములు చేయు వయోజన విద్యావ్యాప్తికి తోడ్పడవలెనని యీసభవారు మద్రాసు ప్రభుత్వమువారిని ప్రార్థించు చున్నారు.

౧౧. గ్రామపంచాయితీలు లోకల్‌బోర్డు ఇనస్పెక్టరు వారి యను మతి పొందనక్కరలేకుండగనే గ్రామ గ్రంథాలయములకు విరాళ ముల నిచ్చుటకు వీలు కలుగచేయుటకు గవర్నమెంటువారిని ఈసభ వారు కోరుచున్నారు.

౮. రు 500/- లకు మించిన ఆదాయముగల ప్రతిపంచాయతీ బోర్డువారు తమ ఆదాయములో సంవత్సరమునకు నూటికి 10 వంతున ఖర్చుచేసి తప్పకుండా ఒక గ్రంథాలయమును పోషించవలెనని ఉత్తర్వులు సాదరుచేయించవలెనని యీసభవారు మద్రాసు స్థానికపరిపాలనా శాఖాప్రభుత్వమువారిని ప్రార్థించు చున్నారు.

౯. స్థానిక సంస్థలక్రింద పనిచేయు ఉపాధ్యాయులలో గ్రంథాలయోద్యమసేవ చేయదలచువారికి పాఠశాలపనికి నష్టమురాని విధమున సేవకు, గ్రామాంతర పర్యటనమునకు ప్రభుత్వమువారు స్థానికసంస్థల కవకాశము నొసగ నీసభవారు కోరుచున్నారు.

౧౦. ఒక పెద్ద గ్రంథాలయమునుండి చిన్న గ్రంథాలయములకు కొన్ని గ్రంథములను ఒకేపర్యాయము తెప్పించుకొని ఉపయోగించి సదరు గ్రంథములను తిరిగి ఆ గ్రంథాలయమునకు చేర్చుటలో ఖర్చులులేకుండ చేయుటకై రైల్వేకంపెనీవారికి ఆర్డరు యివ్వవలసినదిగ గవర్నమెంటు వారిని కోరడమైనది.

౧౧. గ్రంథాలయ శిక్షణను బొందినవారు పనిచేయుచున్న గ్రంథాలయములకు ప్రభుత్వమువారు గ్రాంటుల నిచ్చుటలో ప్రత్యేక విచక్షణను జూపవలెనని ప్రభుత్వమువారిని యీ సభవారు ప్రార్థించు చున్నారు.

౧౨. మద్రాసు ప్రభుత్వమువారిచే జి. ఓ. నెం. 4977 నందు స్థానిక ప్రభుత్వమువారిచే నడుపబడు గ్రంథాలయములందు పని చేయు గ్రంథభాండాగారుల సర్వీసు తక్కువ (Inferior) గా ప్రకటింపబడినది గాన యీసభవారు తమ జి. ఓ. ను సవరణచేసి గ్రంథభాండాగారుల సర్వీసు ఎక్కువ (Superior) గా ప్రకటింప వలయునని ప్రభుత్వమువారికి విన్నవించు చున్నారు.

౧3. గ్రామాలలోని గ్రంథాలయములచే అభివృద్ధికరమైన కార్యక్రమాలను సాగింపచేయుటకుగాను వ్యాయామము, వక్తృత్వము, వ్యాసరచన, పాటలు, చేతిపనులు వగైరాలయందు పోటీలను

జరిపించి యువకులను గ్రంథాలయ సేవలోనికి ఆకర్షించవలసినదిగ యీ సభవారు గ్రంథాలయములవారిని కోరుచున్నారు.

౧౪. ప్రతి గ్రంథాలయ నిర్వాహకముక్రింద ఒక రాత్రిపాఠశాలనుస్థాపించి విద్యాశాఖాధికారుల అనుమతి పొంది, ప్రభుత్వ ధన సహాయమును పొందుచు, జనసామాన్యమునందు వయోజన విద్యావ్యాప్తిని గావించవలెనని గ్రంథాలయ నిర్వాహకులను ఈ సభవారు కోరుచున్నారు.

౧౫. గ్రంథాలయ రిజిస్టర్లను సాధ్యమైనంత త్వరలో తయారుచేసి అచ్చు వేయించవలసినదిగా ఆం. దే. గ్రం. సంఘమువారిని యీ సభవారు కోరుచున్నారు.

౧౬. మద్రాసు, కలకత్తా విశ్వవిద్యాలయముల వారివలె, ఆంధ్ర విశ్వవిద్యాయలము వారు గూడా గ్రంథభాండాగారుల తరగతులను ఏర్పరచవలయునని యీసభవారు ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిని కోరుచున్నారు.

౧౭. ప్రపంచ వాఙ్మయములో సంస్కృత వాఙ్మయము ప్రాచీనము. అందలి గ్రంథములు సర్వోత్తమములు. సంస్కృతవిద్య క్షీణించుటవలన అనర్థము కలుగుచున్నది. కాన ఉన్నత ప్రాథమిక పాఠశాలలందు పైతరగతులలో సంస్కృత విద్యను నిర్బంధముగ ఏర్పాటు చేయవలయునని యీసభవారు తీర్మానించుచున్నారు. ప్రతి గ్రంథాలయమందును సంస్కృతవిద్యను బోధించుటకు తత్తధికారులు తగిన ప్రయత్నములు చేయవలెనని సభవారు కోరుచున్నారు.

౧౮. ప్రతి గ్రంథాలయము తమ గ్రంథాలయములోని భాండాగారిచేత ప్రతిదినమును వార్తాపత్రికలోని ముఖ్యాంశములను సామాన్య ప్రజకు చెప్పించుచుండవలయునని యీసభవారు గ్రంథాలయములను కోరుచున్నారు.

౧౯. ఆంధ్రదేశమందున్న గ్రంథాలయ పఠనాలయములు మొదలగు విద్యాప్రచారక సంస్థలు సక్రమమైన విధానముతో నడచు

టకును, అభివృద్ధి చెందుటకును, ఆం. దే. గ్రం. సంఘము తరఫున సంఘ ఆర్థికపరిస్థితి ననుసరించి కొందరుద్యోగులు ఉండుట అవసర మని యీ సభవారు అభిప్రాయపడుచున్నారు.

౨౦. ప్రభుత్వమువారిచే ప్రచురింపబడి గ్రామాధికారులకు మామూలుగా పంపబడుచున్న వ్యవసాయ, సహకార, ఆరోగ్యశాఖల ప్రభుత్వ కరపత్రములు, చిత్రపటములు వగైరా ప్రచురణలను ప్రతి గ్రామ గ్రంథాలయమునకు తప్పక పంపు యేర్పాటు చేయించవలసి నదిగనున్న, ఆయాశాఖల అధికారులు గ్రంథాలయ సంఘమువారు కోరినప్పుడు వచ్చి అన్నివిధముల వారికి తోడ్పడుటవల్ల ఆప్రచురణ లకుసార్థకత కలుగుననియు యీసభవారు ప్రభుత్వమువారిని కోరు చున్నారు.

౨౧. వచ్చేసంవత్సరము ౨౮ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహా సభ హిందూపురంలో జరుపుటకై వచ్చిన ఆహ్వానమును మహాసభ వారు అంగీకరించు చున్నారు.

---

# ప్రచారశాఖా సమావేశము

## అధ్యక్షోపన్యాసము *

అధ్యక్షులు: శ్రీ మోటూరి సత్యనారాయణగారు

ఇప్పటి కాలములో యుద్ధము అన్నిదేశాలలోనూ విషమముగా జరుగుతున్నది. యుద్ధమునకు సంబంధించిన తమతమ అభిప్రాయాలను ఆయా దేశములవారు తెలియజేయడము ఆవశ్యకము. అందుకొరకై సకలదేశాలవారూ ప్రచారము చేస్తూ ఉన్నారు. తాము తలచిన పథంలో యుద్ధమును నడిపించడానికి ఆయా నాయకులకు ప్రచారము అవసరము. అది సత్యమవునా ? కాదా ? అనేది వేరేవిషయము. మొత్తానికి ప్రచారరూపాన వారు తమ భావాలను వెదజల్లుతున్నారు. ఏ విభాగంలోనయినా ప్రచారమనేది అవసరము. అది సాధింపదలచిన దానికి ఒక మంచిసాధన. సాధనను తగినట్టుగా ఉపయోగించుకొనే శక్తి ఉండాలి. ప్రచారమనేది ఒక సాధన అయినప్పుడు దానిని బాగా ఉపయోగించే శక్తి ఉంటే అన్నిపనులనూ అనాయాసంగా చేయవచ్చు.

మనకు ప్రకృతి అనేక సాధనములను యిచ్చింది. వానిని మనము ఉపయోగించుకుంటున్నాము. మనకు బుద్ధివికాసం కలిగినప్పుడు సమర్థమైన బుద్ధితో కొన్నిసాధనలను మనము ఊహింపగలము. మన ఉపయోగంలో పెద్దలు ఊహచేసి ప్రసాదించిన సాధనలు అనేకము లున్నవి. కాలపరివర్తనము చిత్ర విచిత్రంగా ఉన్నప్పుడు ప్రకృతిసిద్ధములయిన సాధనలు అంతగా ఉపయోగింపవు. అపుడు మానవులు అవసరానుగుణంగా ఇచ్చిన సాధనలు చాలా ఉపకారము లవుతవి. ప్రచార రూపమయిన సాధనము చాలామంచిది.

మన మతప్రవక్తలందరూ మంచి ప్రచారకులు. వారొనరించిన ప్రచారమువలన దేశాలకు అనర్థము కలుగలేదు. శంకరభగవ

* పూర్తిపాఠము చేరనందున వారి యుపన్యాసవిషయ మిందు సంగ్రహముగ నీయబడినది.

త్పాదుడు చేసిన ప్రచారప్రభావము ఇంకా మనమీద ప్రసరించు తూనే ఉన్నది. మతప్రవక్తలందరూ పరిశుద్ధమయిన అంతఃకరణ కలవారు. నిష్కల్మషంగా ప్రచారముచేస్తే అది బాగా వ్యాపించు తుంది. మంచిఫలము నిస్తుంది. ప్రచారములోని పరిశుద్ధి పరిశుద్ధ ఫలమును ప్రసాదించుతుంది. దేనికయినా పరిశుద్ధి అవసరము.

గ్రంథాలయముల విషయమై మన దేశాన మంచి ప్రచారము జరిగింది. దాని ఫలంగా నేడు ఇన్ని గ్రంథాలయములను చూడగల్గు తున్నాము. గ్రంథాలయోద్యమమును ప్రచారము చేసేవారు విజ్ఞా నము కలవారయి ఉండడము అవసరము. ఇంతకుపూర్వము గ్రంథా లయోద్యమము రాజకీయ వాతావరణంలో మగ్నమై పాడయింది. ఇపుడు ప్రత్యేకత్వమును వహించి గ్రంథాలయోద్యమము విజ్ఞాన మును విజృంభింపజేయడానికె ప్రయత్నముచేయుట సంతసము. మనము ఏ విషయమును ప్రచారము చేసినప్పటికీ వర్గీకరణము, విభా గము అవసరము. మన జీవితంలో విజ్ఞాన విభాగాలు అనేకములు ఉండనే ఉన్నవి. ఏయే విజ్ఞానము ఎవరెవరికి అందుబాటులో ఉం టుందో మనము పరిశీలించి ప్రచారము చేయడము ఆవశ్యకము. ఏ కాలములో నయినా ఏ విజ్ఞానానికీ నాశము ఉండరాదు. సకల విజ్ఞానములనూ సంరక్షించడానికి సర్వజనులూ పూనికతో ప్రచా రము చేయాలి. ఒకరు వేరొకరి విజ్ఞానమును తిరస్కరించడము యుక్తముకాదు. మనము సూక్ష్మముగా పరిశీలించితే మన జీవితంలో అనేక విజ్ఞాన విభాగాలు ఉన్నట్లు గ్రహింపగలము. ఒక్కొక నిమిత్త మును అనుసరించి ఒక్కొక విజ్ఞానము ఉపకారక మవుతుంది. మనలో మనము పరస్పరమూ సంబంధ విధానాలను సరిగా సర్దుకోవడానికి తగిన వ్యవస్థకూ వేరొక విజ్ఞానము అవసరము. ఇట్లాగే మానసిక ములు, బౌద్ధికములు, ఆత్మికములు, ధార్మికములూ అయిన విజ్ఞాన విభాగములు మనలను ఆవరించి ఉన్నవి. అవి అన్నీ జీవితానికి సం బంధించి ఉన్నట్లు గ్రహింపలేని లోకానికి ప్రచారంవలన వివేకమును కలుగజేయాలి. ఆధ్యాత్మికమయిన ఆదర్శము ప్రతివానికీ ముఖ్య

ముగా ఉండాలి. మానవుడు మందుడుకాడు. అనేక శక్తులకు అతడు నిలయము. సరిఅయిన ప్రచారము ఉన్నప్పుడు చక్కని విజ్ఞానము కల వాడై ఎంతటి దుష్కరకార్యము నయినా చక్కగా చేయగలడు.

బాలునిలో కూడా మంచి సంచలనం ఉన్నది. దాన్ని ప్రచారకుడు గ్రహించి విజ్ఞానానికి ఉపయోగించేటట్లు చేయాలి. ఈ విధంగానే స్త్రీల వివేకమును వృద్ధుల వివేకమునూ కూడా వ్యర్థంచేయక విజ్ఞానానుకూలం చెయ్యాలి. దానికి ప్రచారము అవసరము. ఈవిధానమె జాతికి అభ్యుదయమును సంపాదించుతుంది. ప్రతిదేశము కూడా తన అభివృద్ధికి ఈపనులను చేస్తున్నది. మనము అవశ్యంగా ఈవిధానమును అందరకూ అలవరచడము అవసరము. మానవశక్తులకు అత్యద్భుత ప్రభావం ఉన్నది. ఆశక్తులు సరిఅయిన మార్గాన ఉంచడానికి తగిన ప్రచారమును మనము అవలంబించక పోవడమువలన దుర్వినియోగం పొందుతున్నవి. విపత్తును సంపాదించు తున్నవి. మనబుద్ధులు వికసించి ఉపయోగించాలి. తన మనస్సు వికసించకపోతే ఎవ్వడూ ఏమీ చేయలేడు. మానస వికాసమును సంపాదించడానికి ప్రచారమొనర్చాలి.

గ్రంథభాండాగారి విజ్ఞాన ప్రచారానికి బాగా ఉపయోగించుతాడు. ప్రచారసామర్థ్యం కలిగిన గ్రంథభాండాగారి ఆధ్యాత్మికమయిన ఆదర్శమును అలవరచుకొని, మతధర్మాలను ఆధారంగా చేసుకొని, విజ్ఞానమును ప్రధానం చేసుకొని, ఆయాపరిస్థితులను అనుసరించి సంప్రదాయాలనుబట్టి అవసరాలను అనుసరించుతూ, ప్రధానాదర్శాలను మార్చకుండా సాధనలను మాత్రం మార్చుతూ, అనుకూలంగా లోకానికి అందజేస్తూ ప్రచారం చెయ్యాలి. గ్రంథాలయము సకల ప్రయోజనాలను ఇచ్చేదయి సకల సర్వస్వంగాఉండాలి. మనకు ప్రచారఫలితంగా అనేకములు వచ్చినవి. మన అవసరాలను అనుసరించి ఉన్న ప్రచారము విరుద్ధ ప్రచారమువలన నాశనము కాదు. మన పూర్వులు మన అవసరాలను గ్రహించి అనేకములను ప్రచారములోనికి తీసికొనివచ్చి ప్రసాదించారు. దేవుడు, ధర్మము, కర్మ మొదలయినవన్నీ మన ఆధార సిద్ధాంతములు. వీనిని విరుద్ధ ప్రచారముతో

కప్పిపుచ్చరాదు. సాహిత్యము కూడా అవసరానుగుణంగా అనేక విధాల మార్పునుపొందింది. నేడు జాతీయ సాహిత్యం వృద్ధిపొందుతున్నది. అందరూ దానితోటే ఆనందించలేరు. విభక్తీకరణం అవసరమా? అనికూడా ఆలోచించాలి. ఎవరెవరు ఏసాహిత్యమును ఆస్వాదించి తమశక్తులను వృద్ధిని పొందించుకొనగలరో వారివారికి ఆసాహిత్యమును అందచేయాలి. కొందరు కొందరు తమకుకావలసిన సాహిత్యమును గుర్తించలేరు. భిన్నపథానపడి తమశక్తులను వృథాచేసికొనడమును ఈనాడు చూస్తున్నాము. అందువలన మంచి సాహిత్యప్రచారముతో మానవశక్తులను వృద్ధిపొందించాలి. ఆయా సామర్థ్యాన్ని బట్టి ఆయా సాహిత్యం వస్తుంది. ఎవడూకూడా తన అర్హతకు మించినదాన్ని అనుసరించలేడు. అయినా తనకు ఉన్న అర్హతను క్షీణింపచేసే సాహిత్యసేవ ప్రచారంలోకి రాకూడదు. తనతన స్వభావానుసారంగా శక్తులను వృద్ధిపొందించే సాహిత్యసేవ చేస్తేనే తాను బాగుపడగలడు. లోకోపయోగము అప్పుడే కలుగుతుంది.

ఒకడు విద్యావేత్త అయినాడంటే తన పరిసరమునంతా అతడు బాగుచేయాలి. మన విజ్ఞానము గొప్పది. మన ప్రచారములు బాగుండేవి. అప్పటిలో విద్యావేత్తలు పరిసరములలో విద్యాబీజములను వెదజల్లేవారు. ఇదివరలో ధార్మికశక్తి ఉన్నది. ఇపుడు మార్పు వచ్చింది. దీన్నిబట్టి మనసాధనలను చూచుకొని ప్రచారముచెయ్యాలి. కేవలము ముందంజ వేసినంతమాత్రాన ప్రయోజనము ఉండదు. ముందునడకతో వెనకపరిస్థితులను పాడుచేసికొన్న లోకమునకు విజ్ఞానము కలుగదు. ముందడుగులో విశేషములున్నప్పటికీ తన సంప్రదాయములకూ, తన పరిస్థితులకూ, తన అవసరాలకూ తగిన సమన్వయమును చూచుకొని ప్రవర్తించడము మంచిది. అన్నిటినీ కృషిచేసిగ్రహించుట ఉత్తమము. కాని మన ఆధారసూత్రములను విడిచినట్లయిన లాభము కలుగదు. మౌలికనియమాలను పునాదిగా ఉంచుకొని విజ్ఞానాభివృద్ధికై ప్రచారముచేయుట నేటికాలములో అత్యంతమూ అవసరమని చెప్పుటలో నాకు సంతసమున్నది.

---

# దేవాలయములు : గ్రంథాలయములు

## ఆగమ - అనుభవ ప్రమాణములు

శ్రీ పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులుగారు
అనకాపల్లి శ్రీ శారదాగ్రంథాలయ భాండాగారి

౧. దేవాలయము పవిత్రమగు (ఉన్నతమగు) స్థానమందు కట్టవలెను.
గ్రంథాలయ భవనము గ్రామమందలి భవనములకంటె మిన్నగా యుండవలెను.

౨. చీకటియందు వెలుతురును చూడవలెనను ఉద్దేశముతోనే గర్భాలయము చీకటిగ యుండునటుల నిర్మింపవలెను.
అజ్ఞాన తిమిరమును పారద్రోలి విజ్ఞానజ్యోతిని ప్రకాశింపజేయుటకే గ్రంథాలయపేటికల యందలి గ్రంథరాజములు నిక్షేపింపబడవలెను.

౩. దేవళమునకు అంటువ్యాధులు గలవారు పోగూడదు.
గ్రంథాలయమునను పీ రళ్లే ప్రవేశింపరాదు.

౪. దేవాలయమందు చుట్ట, బీడీ మొదలగునవి త్రాగరాదు.
గ్రంథాలయమందును నివి వర్జనీయములే.

౫. స్నానము చేయనిదే దేవాలయమునకు పోరాదు.
నిర్మలుడయ్యే గ్రంథాలయమునకు పోవలెను.

౬ దేవాలయములందు త్రికాలార్చన జరుగవలెను.
గ్రంథాలయములందును అన్నివేళల గ్రంథపఠనము జరుగుచుండవలెను.

౭. దేవాలయములం దవిచ్ఛిన్నముగ అఖండ దీపారాధన వెలుగు నీయవలయును.
గ్రంథాలయములందు విజ్ఞానజ్యోతి విడువకుండ ప్రకాశించవలెను.

౮. దైవచింతనవినా ఇతరసంభాషణలు దేవళమందు చేయరాదు.
జ్ఞానసముపార్జనమునకు వ్యతిరేకమగు సంభాషణలు గ్రంథాలయమందు పనికిరావు.

౯. దేవాలయము విద్యావంతులకు కల్పతరువు (పోషించునది)గా నుండవలెను.

గ్రంథాలయము విద్యావంతులను తయారుచేయు కళాశాలగ నుండవలెను.

౧౦. దైవారాధనకు పరిమళముగల పుష్పములే వాడవలెను.
గ్రంథాలయము సద్గ్రంథములనే ప్రచారము చేయవలెను.

౧౧. దేవాలయము నృత్యగీత వాద్యాది వివిధకళల కుపకరించు మంటపములతో విరాజిల్లుచుండవలెను.

గ్రంథాలయము సమస్తకళలకు సంబంధించిన శాస్త్రగ్రంథములతో నిండియుండవలెను.

౧౨. సర్వజనసమ్మేళనమునకు దేవాలయము కేంద్రస్థానముగ నుండవలెను.

సర్వ మానవసౌభ్రాతృత్వమును గ్రంథాలయము పెంపొందించవలెను.

౧3. దైవసేవకు భక్తి, శ్రద్ధ ముఖ్యము.
గ్రంథాలయసేవకు యుక్తి, నిలకడ అవసరము.

౧౪. సాత్త్వికుడై జగత్కల్యాణముకొఱకు పాటుబడుటయే దైవారాధకుని విధి.

సర్వజ్ఞుడై సర్వప్రపంచమును ప్రేమించుటయే గ్రంథాలయారాధకుని విధి.

# గ్రంథాలయములు - ప్రదర్శనకార్యము

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, ఎం. ఏ.,
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు

మనదేశమునందు బహుసత్వరాభివృద్ధిని మనము నేడు వాంఛించుచున్నాము. సంపూర్ణస్వరాజ్యము మనకు కావలెనని కోరుచున్నాము. జనసామాన్యము రాజ్యమేలుకొనువారు కావలెనని పట్టుబట్టినాము. ప్రస్తుతము మన ప్రతినిధులు పరిపాలనలో నున్నను లేకున్నను సంపూర్ణస్వాతంత్ర్యము హస్తగతమయి యున్నను కాకున్నను మనము పరిపాలనాభారము నిర్వహింపవలసినదని మన ప్రతినిధులకు అప్పుడప్పుడు అనుజ్ఞ నిచ్చుచున్నాము. వారిచేత ప్రజల ఆర్థిక నైతిక దుస్థితులు తొలగుటకు కావలసిన ప్రణాళికలు ప్రచారమునందు పెట్టించు ప్రయత్నములు చేయుచున్నాము. మన పెద్దలు పరిపాలన కార్యములు నిర్వహించనప్పుడు గూడ వారుపెట్టిన ప్రణాళికలను తత్కాలికపు ప్రభుత్వములు నిర్వహింపవలసినదనియు సమయోచిత ప్రజాహితచర్యలు పుచ్చుకోవలసినదనియు నొక్కినొక్కి చెప్పుచున్నాము. మన దేశీయనాయకులు 56 ఏండ్లుగ చేసినకృషి, చూపిన త్యాగముల ఫలితముగ మనకీనాడు అన్నిస్వాతంత్ర్యములు కలిగినా కలుగకపోయినా క్రిప్సు రాయబారముచేత ఒకవిషయము స్పష్టమయినది. కేంద్రప్రభుత్వానికి సంబంధించిన ఏ యొకటి రెండు విషయములను దప్ప తక్కిన పరిపాలనపు బరువునంతటిని మన ప్రతినిధులు మోయువారవుదురు. యుద్ధకారణంగా మనకు రాబోవు లాభాలగణనగాని నష్టపు గణనగాని ఇప్పుడు మనము వేయలేము. ఉన్న పరిస్థితులలో మనదేశమున సంపూర్ణమో అసంపూర్ణమో అయిన ప్రతినిధిపరిపాలన, దాని సంపూర్ణత్వము సాధించుటకు నిరంతరకృషి, త్యాగములు తప్పవు. వట్టి గవర్నరుల ఏజంట్లు నిరంకుశముగా ఏలుతూ వున్నా మనలను స్వయంసంపూర్ణులు కండని, శత్రునిరోధకులు కండని ఇతఃపూర్వము కని విని యెరుగని విధాన నిరంకుశాధికారులే మనలను కోరునట్టికాలము

వచ్చినది. తమ ప్రబోధమును ఆచరణలో బెట్టుటకు అంతో ఇంతో చర్య దీసికొనవలసిన అవసరమును ఏర్పడినది.

ఇట్టి మహత్తమ సంచలనయుగమున మన ప్రజలకు విజ్ఞాన విషయ గ్రహణశక్తుల నన్నిటిని బుద్ధిమంతులు సమకూర్చక పోయిన యెడల వారు తమధర్మమునకు దూరులయిన వారగుదురు. ప్రజావికాసానికి – అన్ని జీవితశాఖలలోని వికాసానికి - రాజకీయార్థిక సాంఘిక వికాసాలకు – తగిన ప్రణాళిక వేసుకోనిపక్షమున మనము ప్రపంచ ప్రవాహమున నిలువలేనివారమయి పోదుము.

ప్రస్తుత సాధనాలు మనకు చాల తక్కువ. 1906 వ సంవత్సరమునుండి దేశీయమహాసభవారు జాతీయ విద్యాప్రచారానికై యెంత పాటుపడినా- విజ్ఞానశాస్త్ర, సారస్వత, పారిశ్రామిక విద్యలను సమ్మేళనపరచి విద్యలు ప్రవర్ధిల్లచేయవలసినదని - ఎన్ని తీర్మానాలుచేసి తత్కార్యాచరణకు అప్పుడప్పుడు కొంత ప్రయత్నము చేసినమాట నిజమే అయినా, మన ఆంధ్రదేశములో నేటి వార్ధా విధానానికి సమమయిన విద్యాప్రణాళిక 1924 లో సిద్ధము చేసుకొన్నా, వార్ధావిధానము దేశమందమలులో పెట్టుటకు కొన్ని ప్రయత్నాలు సాగియున్నా, మన కాంగ్రెసు ప్రభుత్వాలు $2\frac{1}{4}$ సంవత్సరాలు అధికారంలోనుండి పనిజేసినా, క్రింది తరగతులలో విద్యాలయాలలో భూవర్ణనశాస్త్రము చెప్పేటప్పుడు గ్రామములో పడే వర్షము, పడే దినములు, ఉన్న నీటి ఆధారాలు, పండే పంటలు, వాటి వివరాలు వగైరాలు పిల్లలు కంటితోచూచి, చేతితో తాకి విమర్శించేట్లుగా చేయవలసినదని శిలబస్సులు మారినా, నేటికింకా మన బళ్లలోని చదువులు మన గ్రామజీవితం దగ్గరికి రాలేదు. మీ నారింజఫలములు, మీ పసపు, మీ వరి, మీ తాళ్లు, నిదర్శనాలుగా తీసికొని భూవర్ణన శాస్త్రము, లెక్కలు, సారస్వతము, చరిత్ర, భౌతికశాస్త్రాదులు ఎక్కడికక్కడ ప్రపంచ ప్రవాహములతో సమన్వయముచేసి చెప్పే ధోరణులు యోగ్యతలు ఏం. ఏలు, బి. ఏలకు రాలేదు. గ్రామపు బడిపంతుళ్లకు అంతకంటె రాలేదు. వీరికిది యిట్లు పట్టించవలెనను కుతూ

హాలము బోధనాభ్యసన కళాశాలల నిర్వాహకులకుగాని విశ్వవిద్యాలయాలవారికిగాని కలుగలేదు.

నేటి విద్యార్థులే రేపటి వయోజనులు. విద్యార్థి దశనుండి వయోజనులు కాబోయే వీరిమాట యట్లుండ విద్యాగంధమే నెరుగని నూటికి 90 గురు వయోజనులు ఇదివరలో అక్షరాస్యులయి గ్రామ వృత్తులలో నుండలేక రెంటికి చెడ్డ రేవడులయిన ఇతరులును ఎందరో గలరు. వీరియందర యుపయోగార్థమని మనగవర్నమెంటులో ఆరోగ్య శాఖ, వ్యవసాయశాఖ, పరిశ్రమశాఖ, కోఆపరేటివ్ శాఖ, లేబరుశాఖ, స్థానికపరిపాలనశాఖ, ఇత్యాది శాఖలు ప్రతిసంవత్సరమున కోట్ల కొలది కర్చులకు కారణములయి పనిచేయుచున్నవి. ఈశాఖలవారు ప్రజల వికాసానికని చాల కరపత్రాలు, గ్రంథాలు, చిత్తరువులు ప్రకటించు చున్నారు. వీనిని గ్రామాధికారులకు, తమశాఖలలోని క్రింది యుద్యోగులకు, కొన్నిసందర్భాలలో కొందరు వ్యక్తులకు పంపుచు న్నారు. కాని ఇవి యెచ్చటా ప్రజలందరికి అందడానికి ఏర్పాట్లే లేవు. కాంగ్రెసు ప్రభుత్వములో ఇన్ఫర్మేషన్ మంత్రి యేర్పడి వారికి కార్యదర్శి, సిబ్బందీ యున్నను సర్కారు కార్యాలయాలనుంచి పంపే యీవాఙ్మయమంతా గ్రామోద్యోగుల దస్త్రాలలో బంధింపబడడానికి తప్ప మరి యేయుపయోగమైనా పొందుచున్నదాయని పదిగ్రామాలకు ఆకస్మికంగాపోయి పరిశీలించినది లేదు. ఆంధ్రదేశములో 600-700 గ్రంథాలయాలు గ్రామాలలో పనిచేయుచున్నవి కదా వాని ద్వారా వీని ప్రచారము చేయింతుమని భ్రమయయినా పడినట్లు కానరాదు. ఇటీవల శాశ్వతరాష్ట్ర ప్రదర్శనాగారాలు, వాటి వెంబడిన జిల్లాలలో శాశ్వత ప్రదర్శనాగారాలు నెలకొల్ప ప్రయత్నించినారు. కాని ఎంతమంది గ్రామస్థులు ఈకర్మాగారాలను చూడబోయెదరో లెక్క వేసుకొన్నట్లు గానరాదు. విత్తనము, ఎరువు, పంటలు, గ్రామ పరిశ్రమలు అన్నిటికి సంబంధించిన విజ్ఞానం రైతు ఇంటిదగ్గరకు ఎట్లు తీసికొనిపోదమా యను ఆలోచనలో గ్రంథాలయాలవారిని, పంచాయతులవారిని భాగస్వాములుగా అంగీకరించడానికి కాంగ్రెసు ప్రభు

త్వానికి గూడ దొరతనపు నీటురావడము సామాన్య ప్రజల సంస్థల యెడల విద్యావంతులగు పట్టణవాసులకు గల అనాదరణను చాటు చున్నది. కాని మించిపోయినది లేదు. ప్రజాసమూహములు మేలు కొనవలె. గ్రామవాసుల మేలును గ్రామవాసులే తీర్చుకొన నర్హు లనుటను చాటవలె. గ్రామసంస్థల సంప్రతింపు సహకారములతోనే రాష్ట్ర కార్యములు జరుగవలెనని గట్టిగా పట్టుదల పూనవలె. విజ్ఞాన విషయములకు గ్రామములోని ముఖ్యసంస్థలు — విద్యాలయము, గ్రం థాలయ పఠనాలయము. విద్యాలయము విద్యార్థుల మాత్రవ్యాప్తి కలది. గ్రంథాలయము విద్యార్థులకు వయోజనులకు ఎల్లరకును సంబంధించి విస్తారతరవ్యాప్తి గలది. అందుచేత విద్యాలయాలు సంకు చితంగా ఉన్నా అక్కడపడే లోట్లు పూర్తిచేయడానికిని వయోజను లకు కావలసిన సర్వోపకరణములను సేకరించిపెట్టి అందివ్వడానికిని గ్రంథాలయములు నడుములు బిగించవలెను. అక్షరాస్యతా ప్రచారము, గ్రంథప్రచారము, పత్రికా ప్రచారములతో కూడ స్థానికావసరము లను బట్టి యావశ్యకమగు వాతావరణ, భూగోళ, వ్యావసాయక, పారిశ్రామిక, ఆరోగ్య, ఆర్థికాది సర్వవిషయ సంబంధియగు విజ్ఞాన ప్రచారమునకును గ్రంథాలయములు పూనుకొనుటకు పరిస్థితులు కల్పించుకొనవలెను. బొమ్మలు, పటములు, సాధ్యమయినవరకు వస్తు వులు, ఉపకరణములు, వస్తునిర్మాణ విధానములు అన్నిటిని జత చేర్చుకొని ప్రదర్శనమూలముగా కూడ విజ్ఞానవ్యాప్తి చేయుటకు కంకణము కట్టవలెను. ప్రభుత్వపు శాఖలనుండి సంపాదింప వలసిన అన్ని పరికరములు, వస్తువులు, ప్రకటనలు సంపాదించటమే గాక తాము కృషిచేసి సులభమార్గాలలో ప్రదర్శన సామగ్రిని సిద్ధపరచి కొని తమప్రాంత ప్రజలకు తమగ్రంథాలయము నిరంతరము సేవింప దగిన కల్పతరువును గావింపవలెను.

---

# బాలవాఙ్మయము : నవ్యసాహిత్యము *

శ్రీ గొఱ్ఱెపాటి వెంకటసుబ్బయ్యగారు
దివితాలూకా గ్రంథాలయ సంఘోపాధ్యక్షులు

దేశానికి బిడ్డలే భాగ్యం. అట్టి బిడ్డలకు తగిన శిక్షణవుంటే తప్ప వారు బాగుపడరు. ఈ శిక్షణ నిచ్చుటకు వాఙ్మయం చాలా అవసరం. బాలుర చిత్తవృత్తి కనుకూలించే చక్కని వాఙ్మయం దేశంలో ఎంతోవుంది. ఇది పిల్లల నోళ్లల్లో, తల్లుల నోళ్లల్లో వున్నదే గాని వ్రాతపూర్వకంగా లేదు. ఆయాప్రాంత భేదాలనుబట్టికూడ ఇది వివిధరీతులుగా వుంది. ఎక్కువగా వయోవృద్ధులగు స్త్రీల కంఠసీమల్లో యిది నిల్చివుంది. నేటి నవనాగరికతవల్ల దీనివ్యాప్తి తగ్గుతుంది. కనుక బిడ్డల మనోవికాసాని కవసరమైన యీబాల వాఙ్మయాన్నంతా అభిమానులు సేకరించకపోతే దేశానికి, భాషకు నష్టం కలుగుతుంది. దీన్ని గురించి శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు, నేదునూరి గంగాధరశాస్త్రి మున్నగువారు శ్రమచేసి పాతపాటలను సేకరించుచున్నారు. వీరికి ఆంధ్రమహాజను లెల్లరు మిగుల కృతజ్ఞులై యుండకతప్పదు.

బాలుర కనుకూలంగా కొందరు ఖండకావ్యాలు, గేయాలూ రచించారు. అట్టివారిలో గురజాడ అప్పారావు, చింతా దీక్షితులు, అడివి బాపిరాజు, నాళం కృష్ణరావు, ముద్దా విశ్వనాథం, గిడుగు వెంకటసీతాపతి, వేంకటపార్వతీశ్వరకవులు, కవికొండల వెంకటరావు, జయంతి గంగన్న, బెల్లంకొండ కనకమ్మ మున్నగువారు కలరు. ఇట్టి ఆధునికులలో కొందరి కృతులను గురించి ముచ్చటిస్తా.

## గురజాడ అప్పారావు

అప్పారావుగారు కన్యాశుల్కం గ్రంథకర్తగా ఆంధ్రలోకానికి తెలుసు. అట్టి గ్రంథం మరొకటి లేదు. ఆయన కవి, సంస్కర్త, దేశభక్తుడు. ఆంధ్రవాఙ్మయంలో నూతనపద్ధతిని గేయాల రచిం

---

* బాలవాఙ్మయ వ్యాసభాగము

చిన వాల్మీకి యితడు. ఈయన అడుగుజాడల్లోనే నేటి భావకవులు భావగీతాలు రాశారు. వీరు రాసిన పాటలనేకం మనోహరంగా వుంటాయి. ఇందులో పిల్లలపాటలుకూడ వుంటాయి. ఆడపిల్లల కనుకూలించే పాట ఒకటి మచ్చుకు ఉదహరిస్తా.

ఆటలపాటల పేటికలారా
కమ్మనిమాటల కొమ్మల్లారా
కలువలకన్నుల కన్నెల్లారా
పిల్లలగన్న తల్లుల్లారా
విన్నారమ్మా యీకథను:-

కొండలనడుమను కోనొకటుంది
కోనకి నడుమ కొలనొకటుంది
కొలనిగట్టున కోవెలలోపల
వెలసెను బంగరు దుర్గమ్మ.

ఏయే ఋతువుల పూచే పువ్వుల
ఆయాఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ.

దేశభక్తిని గురించి అనేకులు రాశారుగాని ఆబాలగోపాలానికి తెలిసేటట్లుగా వ్రాశిన వీరి గీతంలోని భాగాలు చూడండి.

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
వొట్టి మాటలు కట్టిపెట్టోయ్
గట్టి మేల్ తలపెట్టవోయ్.

* * *

పూను స్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థకలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయ్.

* * *

స్వంతలాభం కొంతమానుకు
పొరుగువారికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్.

## చింతా దీక్షితులు

వీరు జగమెరిగిన బ్రాహ్మణులు. స్కూళ్ల ఇన్‌స్పెక్టరగుటచే బాలహృదయం బాగా కనిపెట్టగలిగారు. బాలవాఙ్మయంలో వీరు బాగా కృషిచేశారు. రేడియోలో బాలవాఙ్మయాన్నిగూర్చి ప్రసంగించారుకూడ. 'లక్కపిడతలు' అనే పేరుతో బాలుర కుపయోగించే గేయాలు ప్రకటించారు. పిల్లలనిమిత్తం కొన్ని కథలుకూడా రాశారు. వీరిని ఆధునిక బాలవాఙ్మయబ్రహ్మ అని చెప్పొచ్చు.

వీరి లక్కపిడతలనుండి ఒకగేయం.

### పాపాయి నవ్వు

ఫక్కున సూర్యుడు నవ్వేడంటే
పట్టపగలు ఈలోకమును
ఫక్కున చందురుడు నవ్వేడంటే
చల్లని వెన్నెల జగములకు
ఫక్కున పాపాయి నవ్వేడంటే
పరమానందం నీకూ నాకూ
అవునాకాదా అలివేణీ!

## నాళం కృష్ణరావు

ఈయన సంఘసంస్కర్త. గ్రంథాలయోద్యమాభిమాని. మధుర కవియేకాదు అసలు బాలురకవి. ఈయన కృతులన్నీ పిల్లలకొరకు రాసినవే. బాలబాలికలు చదువదగినవి. వీరి కవితలో జాతీయత, మాధుర్యము, దేశభక్తి, నీతి నిండి నిబిడీకృతమైయున్నవి. తేటగీతముతో తేనెలొలికించును. చూడండి.

### పసిపాప

* * *

కీవి బొటబ్రేశ పిల్లవగ్రోవి నాగ
మోవిఁగీలించి యెల్లర మోహజలధి

నోలలాడఁగ కలరవ మాలపించు
ముద్దుబిడ్డఁడు గోపాలమూర్తికాఁడె ?

పాపాయి

"లేశమేనియుఁ బ్రఖ్యాతి లేనినాకు
కలిగె పాపాయి తండ్రియన్ గౌరవంబు
పద్దియంబులు నీపేర వ్రాయుకతన"

అని చెప్పుకోవడంలో యేమీ అతిశయోక్తి లేదు.

## వేంకటపార్వతీశ్వరకవులు

వీరు తెలుగులో గేయం, పద్యం, గద్యం, హృద్యంగా రచించారు. వీరి రచనలో బాలవాఙ్మయంకూడా వుంది. 'బాలగీతావళి' అనే పేరుతో 5 భాగాలు అచ్చేశారు. అవన్నీ యెంతో యింపైనవి. వీనిలో బొమ్మలుకూడ వేశారుగాని అవంత బాగాలేవు.

వీరివి రెండు గీతాలు.

బొంగరము

రింగురింగునదిరుగు నాబొంగరంబు
యేమియో వ్రాయుచున్నది యిసుకలోన
బడికి పోలేదు పొత్తంబు బట్టలేదు
యెట్లువచ్చినదో దీనికింత చదువు.

దీనిలో బాలకుని అమాయకత అంతా కనబడుతోంది.

భూతదయ

సృష్టిలోన గలుగు జీవంబులన్నియు
నిన్నుబోలి తిరుగుచున్నవగుట
నెట్టిదానిబాధయేని నీబాధగా
జూచికొనుచు దయను జూపవలయు.

పిల్లలు సాధారణంగా చీమలను, చిన్నపురుగులను హింసిస్తారు; చంపుతారుకూడ. వారి చేతులు కాళ్లు బహువులిపివి; వూరుకోవు. కనుక వారికీనీతి చెప్పుట యెంతో అవసరం. ఈవిధంగా వీరిపుస్తకాలు

మిక్కిలి నీతియుక్తంగాను, మృదుమధురంగాను వున్నై. ఇవన్నియు పాఠ్యనిర్ణయసంఘమువారిచే ఆమోదింపబడినవే.

## అడివి బాపిరాజు

ఆధునికుల్లో మెత్తనిచిత్తంగలవారు. వీరి గీతాల్లో బాలవాఙ్మయానికి సంబంధించినవి కొన్నివున్నై. వీరి గంగిరెద్దుపాట చాలా ప్రసిద్ధి చెందింది.

ప్రభువుగారికీ దణ్ణంపెట్టు
పాదంపంచీ భక్తినిపెట్టు,
పట్టుశాలువలు పెట్టెదరంటూ
కానులు మువ్వలు కట్టెదరంటూ
డూ డూ డూ డూ యెంకన్నా !

మోసంజేసును మునసబుగారు
కతలు గట్టును కరణముగారు
కలిమిగలిగిన కాపులె వారు
డూ డూ డూ డూ యెంకన్నా !

కుంచెడుమాయ కోమటిమాట
పత్తికాయగా భేమ్మణధాటి
సలాముతెచ్చే సాయెబుభేటీ
డూ డూ డూ డూ యెంకన్నా !

చెన్నపట్టణం చేరవరాదు
కాశీపట్టం కానగపోదూ
కాపవరమే కదలగలేదూ
డూ డూ డూ డూ యెంకన్నా !

చెట్టుకదలినా పుట్టపొదలదూ
నీరుపోయినా నాచుకదలదూ
గుడిపాడయినా గూబవదలదూ
గుడిపాలాల పూజారివదలదూ
డూ డూ డూ డూ యెంకన్నా !

యెండికొండలా యీశ్వరుడండీ
యేడుకొండలా యెంకన్నండీ
భమిడికొమ్మలా బసవయ్యండీ
డూ డూ డూ డూ యెంకన్నా.

దీనిపై వ్యాఖ్యానమా యింకా?

## టేకుమళ్ల కామేశ్వరరావు

దీక్షితులుగారివలె వీరుకూడ విద్యాశాఖోద్యోగులైన కారణం చేత బాలుర మనస్తత్వం తెలుసుకొని "పాలపిట్ట" పేరుతో పిల్లల కోసం గేయాలు ప్రకటించారు. ఇందులోని మొదటిగేయం

### సూర్యోదయం

పొలంలో
ఆవులవెనకాల
గడ్డివాముల వెనకాల
తాటాకుగుడిసెల వెనకాల
తాటిచెట్ల వెనకాల
మంచుతెర వెనకాల
నల్లనిమేఘాల వెనకాల
అడుగో! సూర్యుడువస్తున్నాడు!

శ్రీ టేకుమళ్ల రాజగోపాలరావు, డాక్టరు చిలుకూరి నారాయణరావు మున్నగు మరికొందరు బాలవాఙ్మయంలో కృషిచేసి పాతపాటలను సేకరించి, నూతనమైనవానిని రచించి ప్రకటించారు.

## గద్యం

మనకవులు సంస్కృతపోకడలనే అన్నింట పోయారుగాని 'గద్యం కవీనాం నికషం వదంతి' అనే సామెత నెందుకో విస్మరించారు. మనవాఙ్మయమంతా పద్యాత్మకంగాను, పద్య గద్య సమన్వితంగానూ వుంది. వచనగ్రంథాలు లేవు. ఏవో కొద్దిగావున్నా ఆకాలంలో వీటికి ప్రాధాన్యతలేదు. ఆంగ్లవిద్యాభ్యాసంతో వచనవాఙ్మయ మారంభ

మైంది. దీనినిర్మాత ఆంధ్రదేశం కళ్లువిప్పిన శ్రీ వీరేశలింగంపంతులు. వీరు శతాధికగ్రంథకర్తలు. నూతనపద్ధతిని వచనంలో అనేక వుత్కృష్ట గ్రంథాలు రచించుటయేగాక బాలుర కుపయోగించే వాచకాలతో పాటు మఱి కొన్నిపుస్తకాలుకూడా రాశారు.

వీరి తరువాతనే వచనంలో అనేక గ్రంథాలు బయలుదేరి వచనయుగమయింది నేడు. ఇట్టి వచనంలో బాలుర కుపయోగపడే లాగు రచించినవారిలో 'దక్షను పూర్వకథలు' రాశిన చదలవాడ సీతారామశాస్త్రులు, 'ఆర్యకథానిధులు' రాశిన వావిలకొలను సుబ్బా రావు, 'పిల్లలకథలు' రాశిన గిడుగు వెంకటరామమూర్తి పంతులు, 'చిత్తూరురాజులకథలు' మున్నగు కథలను రాసిన శ్రీపాద సుబ్ర హ్మణ్యశాస్త్రి, 'జాతీయకథావళి' రాశిన కొప్పర్తి బంగారమ్మ మున్నగువారున్నారు. 'భారతి' లో బాలానందం శీర్షికక్రింద అనేకులు పిట్టకథలు మొదలైనవి రాస్తున్నారు.

## మన కర్తవ్యం

కాని యింతటితో సంతోషించరాదు. ఇదివరకున్న బాల వాఙ్మయాన్నంతా తగిన ఆకృతిలో పెద్దక్షరాలతో, బొమ్మలతో, పిల్లలు చూడగానే ఆటవస్తువులవలె ఆకర్షించేలాగు ముచ్చటగా ముద్రించాలి. కథలంటే పిల్లలు చెవులు కోసుకుంటారు. దేశీయ కథలేగాక ఆంగ్ల, హిందీ, బెంగాలీ మొదలగు భాషల్లోనుంచి మంచి కథలను పరివర్తనచేసి ప్రకటించడ మవసరం. ఈ కథల్లోకూడ ఆయా వయస్సుకు తగినరీతిని ఆయారసము లుండేటట్లు చూడ వలెను. వీరగాథలు, మహాపురుషుల జీవితచరిత్రలు బాలురకు చాలా ఉపయోగకారులు. పాటలుకూడా కథలవలె పిల్లల కానందాన్ని కలుగజేస్తాయి. పైనచెప్పిన బాలవాఙ్మయాన్ని సృష్టించగలవారు మనలో లేకపోలేదు. కాని కార్యరంగాని కొచ్చి దీనికోసం ప్రత్యేకం కృషిసల్పేవారు లేరు. విదేశాల్లోనూ మనదేశంలో చాలా ప్రాంతా ల్లోనూ బాలవాఙ్మయం దినదినాభివృద్ధి చెందుతుంది. హిందీభాషలో

అనేక పిల్లలపుస్తకాలతోపాటు దాదాపు ప్రత్యేకముగ పదిపత్రికలు కూడ వున్నై. మనతోడివారైన కన్నడు లిటీవలనే 'బాలవిజ్ఞానసర్వస్వ'న్నికూడ ప్రకటించారు. విదేశాలల్లో, ముఖ్యంగా ఆంగ్లభాషలో గల బాలవాఙ్మయ మపారం. అమెరికాసంగతి అడగనే అక్కరలేదు. అచ్చటి పసిపాపలే పత్రికలను నడుపుతున్నారు. రష్యాదేశంలో అచ్చటి ప్రభుత్వమే ప్రత్యేకం బాలురనిమిత్తం కోట్లువెచ్చించి అనేకగ్రంథాల నేటేట ప్రకటిస్తూంది. దేశదేశాలలోగల చిత్రకారుల నిందుకోసం వీరు ప్రత్యేకం పిలిపిస్తున్నారు. ఇతరదేశాలతో పోలిస్తే మన బాలవాఙ్మయం ఆవగింజలో అరవయ్యోవంతైనాలేదు. కనుక దీనిని వ్యాప్తిచేసేటందుకై గ్రంథాలయసంఘాలు, బాలవాఙ్మయాభిలాషులు పూనుకోవాలి.

---

# ధర్మగ్రంథాలయము

శ్రీయుత దు. కృష్ణయ్యగారు
హిందూపురం మునిసిపల్ లైబ్రరీ సూపర్వైజరు

విద్యావ్యాప్తికిని నిరక్షరత్వ నిర్మూలనమునకును ముఖ్యమైన మార్గములు రెండు. మొదటిది పాఠశాల; రెండవది గ్రంథాలయము.

నిర్బంధ విద్యావిధానము వలన ప్రాథమిక పాఠశాల అక్షరానభిజ్ఞతను ఐదు సంవత్సరముల కాలములో రూపుమాపగలదు ఉపాధ్యాయుడు పట్టుదలతో పనిజేసి విద్యార్థి క్రమముగా బడికివచ్చినచో. కాని, పాఠశాలలో జదివిన విద్యపైననే బాలబాలిక లాధారపడి యప్పటినుండి గ్రంథపఠనము జేయకున్నచో కొన్ని సంవత్సరములలో వారు నిరక్షరత్వస్థితికి రావలసిన వారగుదురనుట యనుభవసిద్ధము. అందువలననే పాఠశాలలో నేర్చుకొనిన అక్షరజ్ఞానము నభివృద్ధిదశయం దుంచుకొని జీవితమును జ్ఞానమార్గమునందు నడుపుటకు గ్రంథాలయములే జ్ఞానసోపానములనుట. ఒక్కొక్కనికిని పాఠశాలయందు జదువు నవకాశము వేరువేరు కారణముల వలన లేకపోవచ్చును. కాని గ్రంథాలయమునకు సర్వసామాన్యముగా నుపయంగముగ నుండు వయోజన విద్యాలయమునందు జేరి ఒక్కొక్కరును కొంతకాలములోనే నవీన విద్యాపద్ధతుల వలన విద్య నభ్యసించి గ్రంథాలయమును చక్కగా నుపయోగించుకొను స్థితికి రావచ్చునని గ్రంథాలయశాస్త్ర విజ్ఞానము నిదర్శనముల నొసగుచున్నది. ప్రపంచ పరిస్థితులను తిలకించినచో గ్రంథాలయ పద్ధతివలన విద్యావ్యాప్తిని ఆకాశ విమానవేగమున

చెందిన దేశములుగూడ గలవు. అందువలననే గ్రంథాలయమే సర్వజన సామాన్య విద్యాలయమనియు, జాతీయవిశ్వవిద్యాలయమే అనియు శాస్త్రజ్ఞులు నుడువుచున్నారు. కాని, విద్యావ్యాప్తికిని నిరక్షరత్వ నిర్మూలనమునకును గ్రంథాలయము నుపయోగింప వలయుననిన ఒక్కొక్క గ్రంథాలయము కూడ నీపనిని తృప్తికరముగ జేయగలదనుట సాహసోక్తియే యగునేమో! కారణము విశదమే. దేశము నావరించియుండు అవిద్యాపిశాచమే. ఇంతటి విజ్ఞాన మొసగవలసిన గ్రంథాలయ మెట్టి యభివృద్ధి దశ యం దుండవలయునో, యెట్టి యమూల్య పద్ధతులయందు నెలకొల్ప బడవలయునో, గ్రంథాలయ శాస్త్రవిజ్ఞానులు, విద్యావేత్తలు, అనుభవజ్ఞులు చెప్పవలయునే కాని పలుక నేర్చిన వారందరు పలుకవలసిన సంగతి కాదిది. నేడు సామాన్యముగ గ్రంథా లయము లెట్టిస్థితిలో నున్నవో మచ్చునకు జూపి ఆదర్శప్రాయమైన గ్రంథాలయ సేవ యెట్టిదో, ధర్మగ్రంథాలయ మననేమో, దానిప్రయోజన మెట్టిదో తదుపరి తెలిపెదను.

కొన్నిపుస్తకము లొకచో జేర్చి పదిలముగ సంరక్షించినచో గ్రంథాలయమగు నని జనసామాన్యాభిప్రాయము. పుస్తకము లేయుద్దేశముతో వ్రాయబడినవో, వ్రాయ బడుచున్నవో, ఆయుద్దేశమునకు వైతరగతి గ్రంథాలయములు చీడపురుగులవంటి వనిన మన్నింతురుగాక! పుస్తకములు ఉపయోగమునకే యున్నవనియు, నుపయోగమే గ్రంథాలయమునకు ఘనతదెచ్చుననియు, సద్వినియోగ మొనర్పబడిన కొన్నిగ్రంథము లైనను, పదిలముగ తాళములచే సంరక్షింపబడిన గొప్పగ్రంథాలయములకన్న శ్రేష్ఠ మనియు గ్రంథాలయశాస్త్రము ఘోషించుచున్నది. రవీంద్రకవీంద్రుడు ఈశ్రుతిని గాన మొనర్చియున్నాడు. నేడు మన గ్రంథాలయములలో అనేకములందు గ్రంథములు చిమ్మటపురుగులకును, చదలునకును ఆహారమగుచున్నవి. గబ్బిలపుపెంటకును, మూషికములకును నిలయము లగుచున్నవి. కారణమేమి? షట్ప్రకారము పుస్తక ములు పెట్టెలలో యుంచబడి సంవత్సరమున కొకతూరి సరస్వతీపూజనాడు కొన్ని పువ్వులను, అక్షతలను పొందుచుండుటవలననే. భగవద్గీతను పవికట్టులలో భద్ర పఱచి దేవుని మందసములో మక్కువగానుంచి ధూపదీపనైవేద్యము లర్పించుటలో తమకర్తవ్యము దీరెనని "సర్వం శ్రీకృష్ణార్పణమస్తు"ను భగవద్భక్తులులేరా? దీనివలన గీతోద్దేశము తీరినదా? ద్విజేతరులు గీతను వినకూడదనువారు కొందరు. ఆవిధముననే గ్రంథముల యుపయోగమును మనమునం దిడుకొనని గ్రంథాలయము లనేకములున్నవి. పాతకాలలలోని గ్రంథాలయము లనేకము లిట్టి హీనదశయందే యుండుట శోచ నీయము. విజ్ఞానసంపత్తియే దేశాభ్యుదయమునకు మూలమని గ్రంథాలయోద్యమ ప్రియులు, పత్రికారాజములు నిరంతరము ప్రబోధ మొనర్చుచున్నను గ్రంథాలయము లిట్టిస్థితిలో నుండుట కజ్ఞానమే కారణము. అందువలననే ఉభయభాషాప్రవీణ అయినం పూడి గురునాధరావుగారిట్లు వ్రాక్రుచ్చిరి. "ఈ ఉద్యమప్రచారకులు చేస్తున్న శ్రమకు అనురూపమైన ఫలితము కన్పించకుండావున్నదని అంగీకరింపకతప్పదు. ప్రజావిద్య యొక్క వికాసానికి అవ్యాప్రయత్నాలు జరుగకపోవడం, జరుగుచున్న కొద్దిప్రయత్నం

దౌర్భాగ్యవశంచేత తప్పుత్రోవలు పట్టడం, గ్రంథాలయోద్యమముయొక్క నిజమైన ఔన్నత్యానికి ప్రబల ఆటంకము."

అందువలన సక్రమమైన పద్ధతులపై గ్రంథాలయములు నెలకొల్పబడవలయును. గ్రంథాలయోద్యోగి ఈ శాస్త్రవాసన కలవాడుగా నుండి ప్రజల విద్యాగంధము నభివృద్ధిచేయుటలో పట్టుదలజూపు నుత్సాహిగా నుండవలయును. సేవాతత్పరుడు కావలయును. వాచకులు* గ్రంథములు విరివిగా నుపయోగించుటకునై వలయు పద్ధతులను నిరంతర మన్వేషించువాడుగ నుండవలయును. సరియైన గ్రంథాలయము విద్యావంతులకేగాక శిశువులకును, స్త్రీలకును, నిరక్షరులకును, ప్రజాసముదాయమునకంతటికిని వివిధసహాయ మొనర్పవలయుననుట గ్రంథాలయశాస్త్రము విధించుచున్నది. పాశ్చాత్య దేశములలో గ్రంథాలయము లిట్టి పనిని జేయుచునేయున్నవి. ఇట్టి గ్రంథాలయములు కాని, ఉద్యోగులుకాని మనదేశమున నేడు అపురూపమనిన క్షమింతురుగాక !

*　　*　　*　　*

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారు ఇరువదియెనిమిది సంవత్సరములుగ తమ నిరంతరప్రచారము ద్వారాను, సభలమూలమునను, 'గ్రంథాలయసర్వస్వము' 'ఆంధ్ర గ్రంథాలయం' ప్రకటనద్వారాను ప్రబోధము గావించుచుండుట ఆంధ్రుల యదృష్టము. దీనిఫలితముగనే ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము జీవకళతో యున్నది. పాశ్చాత్యసీమలందువలె నిచ్చట గ్రంథాలయోద్యమము శాఖోపశాఖలుగ నెదుగకున్నను, గ్రంథాలయబీజము మాత్ర మిచ్చట చక్కగ నేయున్నది. ఈ బీజమును వృక్షరూపమున వ్యాప్తిజెందించుటకునై పత్రికారాజములు కొన్ని దోహదమొసగుచున్నవి. అట్టి పత్రికానిర్వాహకులకు సాధన్యవాదములు.

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారు సుమారేడేండ్ల క్రిందట 'గ్రంథవర్గీకరణ విధానము' నొకదానిని ప్రకటించినను దీనివిషయమై చాల గ్రంథాలయములకు తెలియనే తెలియదు. గ్రంథవర్గీకరణమే లేకున్న గ్రంథాలయములోని పుస్తకములను వాచకుల కందుబాటులో నుంచుటెట్లు ? గ్రంథాలయములలోని పుస్తకముల నితరులుపయోగింపవలయు ననిన వర్గీకరణమే ప్రథమ మార్గము. వర్గీకరణ విధానము ననుసరించి గ్రంథముల పట్టిక లేక జాబితాను తయారు చేయవలయును. దీనిని తయారు చేయుటలో అనేక మార్గములున్నవి. ఇందత్త్యుత్తమ పద్ధతినే మనమనుసరించవలయును. ఈ జాబితా వాచకుల యెదుట నిరంతర ముండవలయును. గ్రంథములను బీరువాలలో ఈ జాబితా ననుసరించి యుంచవలయును. పుస్తకములు జీవకళతో కళకళ లాడుచుండవలయును. నూతన గ్రంథములను వాచకుల కర్పించుటకునై వానిని ప్రత్యేకముగ, ప్రత్యేక పట్టికలో బొందుపఱచి ఈ గ్రంథములను సర్వజనాకర్షకమైన ప్రదేశమునం దుంచవలయును. కొన్ని కొన్ని గ్రంథములను వాచకుల దృష్టికై మేజాల మీద నుంచుటగూడ నవీన పద్ధతి. గ్రంథాలయ సేవకుడు నిజమైన సేవకుడుగా

* పాఠకులు లేక చదువరులు.

నుండి "మానవ సేవయే మాధవసేవ" యని భావించినచో నచిరకాలములోనే మన దేశములోని గ్రంథాలయములుకూడ పాశ్చాత్య దేశములలోని గ్రంథాలయములవలె విజ్ఞానవ్యాప్తికి మూలాధారములు కాగలవనుటకు సందియములేదు.

గ్రంథపఠనమునకు అంకురార్పణ పత్రికాపఠనాభిలాషగాన పత్రికాపఠనాలయము గ్రంథపఠనాలయములోని ముఖ్యాంగమై యున్నది. పత్రికలలోని కొన్ని చక్కని వ్యాసములను సంపుటీకరించి వాచకుల కర్పించుచుండు గ్రంథాలయములు కూడ అక్కడక్కడ నున్నవి. ఇట్టి సంపుటములతో పాటు దసరాసంచికలు, ఉగాదిసంచికలు పాఠకుల కర్పించుచుండుటకూడ ఉత్తమపద్ధతియే. వీనిని పఠించుట వలన వాచకులకు, గ్రంథపఠనాభిలాష క్రమేణ యేర్పడగలదు. ఇట్టి సుసమయమును గమనించి, లలితగ్రంథములు వాచకుల కొసంగినచో వారియందు గ్రంథపఠనాభిలాష తప్పక కలుగగలదు. జ్ఞానకిరణములు ప్రసరించినచో నజ్ఞానాంధకార మచ్చోట నిలువ గలదా? గ్రంథాలయములే జ్ఞానజ్యోతులుగాన నజ్ఞానతిమిరము మనదేశమున వీనిమూలముననే నశింపవలసియున్నది. అప్పుడే దేశము తేజోవంతము కాగలదు. ప్రపంచములోని వివిధ దేశములతోపాటు మన భారతమాత తలయెత్తుకొని తిరుగ గలదు. అప్పుడే భారతీయులు భారతీకరుణాకటాక్ష పాత్రులు కాగలరు. ఇట్టి కార్యము ధర్మగ్రంథాలయములపై ఆధారపడియున్నది. పుణ్యపురుషుల దాన మీ రూపమున వెలయవలయును. జ్ఞానదానముకంటే దానమున్నదా?

---

# వయోజన విద్యాశాఖా సమావేశము

## అధ్యక్షోపన్యాసము

**అధ్యక్షులు : శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు, ఎం. ఏ.**

మానవుని నాగరికతాచరిత్రలో అతడు సాధించిన కార్యములు రెండు చాలా ప్రాముఖ్యత వహించుచున్నవి. అవి (1) అగ్నిచేయకల్గుట (2) భాషను నిర్మించుట. అగ్నివల్ల లోహములను కరగించి పని ముట్లనుచేసిన మొదటిదశలే ఆధునిక యంత్రయుగం వచ్చుటకు ఆధారములైనవి. యంత్రసాధనములవల్ల ఆహారఉత్పత్తి, జీవిత సౌకర్యాలు హెచ్చుగా పెరిగి మానవునికి తీరిక కలుగజేసి అతని జ్ఞానాభివృద్ధికి తోడ్పడినది.

భాషవల్ల మానవజీవితంలో కలిగినమార్పు యంత్రసాధనము కన్న మించిపోయింది. భాషవల్ల అభిప్రాయములు పరస్పరం తెలియుటకు అవకాశములు కలిగి, సంఘనిర్మాణం జరుగ మొదలుపెట్టింది. సంఘనిర్మాణమే మానవజీవితమునకు బలము, ప్రఖ్యాతి తీసుకొని వచ్చింది. భాషాభివృద్ధి మాటలాడుకొనుటతో ఆగలేదు. దానితో "లిపి" ఏర్పడ్డది. మొదట వ్రాయుట, చదువుట తరువాత శిలాశాసనములు, అంతకంతకు కాగితము, అచ్చు అమల్లోనికివచ్చి, మానవ భావములకు విరివైన ప్రచారమును చేసినవి. ఒకరి భావములు వొకరు వారి తరములందే తెలుసుకొనుటగాక పుస్తకములు గ్రంథాలయాల ద్వారా పూర్వీకులయొక్కయు, యితరజనులయొక్కయు, భావములు తెలిసికొన అవకాశములు కలిగినవి. రానున్న తరములకుకూడ యీ భావములు అందజేయుచు పరస్పరం అర్థంచేసుకొనుట కలిగి, మానవ సంఘనిర్మాణం అంతకంతకు గట్టిపడినది. సంఘం పెరుగుచున్నకొద్దీ, రాజకీయవిధానములు, నైతికనియమములు సంఘంలో భాగములుగా ఏర్పడ్డవి. మానవజీవితంపైన సాంఘికసంస్థలయొక్క ప్రభావము మనకు నిత్యమూ గోచరమే.

సంఘ నిర్మాణమునకు భావప్రచారము, అందుకుగాను భాషా నిర్ణయం అవసరం. భాషను వృద్ధిపొందించునదే విద్య. అంచేత విద్యాభివృద్ధిమీదనే సంఘాభివృద్ధి ఆధారపడివుంది. అంచేతనే పూర్వకాలం నుంచీ సంఘంలో విద్యాసంస్థలు పెరుగుచునే వున్నవి. ప్రాచీన హిందూ యుగమందుకూడా తక్షశిల, నలంద, అమరావతి మొదలగు విద్యాకేంద్రములు వెలసియుండెను. ఆధునిక నాగరికతలో బాలబాలికలందరు విద్య నభ్యసించవలసినదిగా ఆచారము ఏర్పడ్డది. స్వాతంత్ర్య దేశముల్లో ప్రాథమికవిద్యను నిర్బంధవిధానముగా ప్రభుత్వం శాసించింది. ఆదేశముల్లో వయోజనులు యిదివరకే విద్య నభ్యసించుటచేత వ్యవహారిక జీవితంలోగల భావములు వార్తాపత్రికలు, పుస్తకములు, కరపత్రములు, ప్రణాళికలద్వారా అందరికి అందుబాటులో వున్నవి. ఆర్థికంగా బాధపడుచున్న కూలివాడుసైతం సాయంకాలం యింటికి పోవునపుడు ఒక వార్తాపత్రికను కొనుక్కొని యింటివద్ద చదువుచుండుట స్వాతంత్ర్యదేశములలో సామాన్యవిషయం. ఆర్థిక సమానతలేని దేశములలో పత్రికలు, పుస్తకములు, అందుబాటులో వుండుటచేత, భావప్రచారం సులభమై ప్రజలందరు సంఘాభివృద్ధికై అధికముగా తోడ్పడుచున్నారు.

బానిసదేశమగు ఇండియాలో ప్రాథమికవిద్యను నిర్బంధించు బాధ్యత యీ ప్రభుత్వం తీసుకొనలేదు. అంచేత యీ దేశములో వయోజనులలో భావప్రచారం అధికంగా వుండుటకు అవకాశములు ఏర్పడుటలేదు సంఘాదర్శములకు ప్రజల ఆచరణకు చాలా దూరమైపోయినది. వయోజనులలో భావప్రచారం చేయవలెనంటే, ఉపన్యాసాలుతప్ప వేరు సాధనములేదు. చదువు లేకపోవటముచేత భాషయొక్క ఉపయోగం ఇండియాలో స్వల్పమైపోయింది. స్వాతంత్ర్యదేశములతో పోల్చి చూచినయెడల గ్రంథప్రచురణ, వార్తాపత్రికలసంఖ్య ఇండియాలో బహుస్వల్పం. గ్రంథాలయముల ఉపయోగంకూడా తక్కువగావుంది. వీటన్నిటికి ఇండియాలో విద్యలేకపోవడమే కారణం. ఇండియాదేశము అభివృద్ధి పొందాలంటే భారతీయు

లలో సంఘబలం అధికం అవాలంటే వయోజన విద్యాప్రచారము ముఖ్యమగుచున్నది.

స్వాతంత్ర్యదేశములలో బాల్యదశలోనే విద్య వచ్చియుండుట చేత వయోజనవిద్యా ప్రచారం అనగా భావప్రచారమనే అర్థముతో సరిపోవుచున్నది. ఆ దేశములలో రాచకీయ సిద్ధాంతాలు, వ్యవసాయ అభివృద్ధి విధానములు మొదలగునవి వేసంగిపాఠశాలలో వయోజన విద్యగా నేర్పుదురు. అనగా ఉపన్యాసాలకు కరపత్రములు, పుస్తకములు, విస్తారము తోడ్పడుచుండును. కాని భారతదేశములో వయోజన విద్యాప్రచారమునకు రెండు బాధ్యతలు వచ్చుచున్నవి. (1) విద్యగరపుట (2) భావప్రచారం. విద్యలేని భావప్రచారం కష్టతరమగుచున్నది. భావములేని విద్య వయోజనులకు రుచింపదు. అంచేతనే వృత్తివిద్యాప్రచారమే ఆదర్శంగా తీసుకొనిన వయోజనవిద్యాసంస్థల కృషి భారతదేశంలో ఫలించకున్నది. ఇతర భావములతో నిమిత్తం లేని బాల్యావస్థలో ఒక్క విద్యాభ్యాసమే కొనసాగవచ్చును. బాలురకైనను ఆటలద్వారాను, పనులద్వారాను చెప్పిన చదువే త్వరగా వారి నాకర్షించుచున్నదనుటకు కిండర్‌గార్టెను విద్యావిధానం, వార్ధా విద్యావిధానం నిదర్శనములు. బాలుర చదువుతో బాలుర వాతావరణములోని భావములు మిళితము చేయవలసివచ్చుచున్నది గదా; అటువంటప్పుడు విశేష భావములతో వ్యవహరించుచున్న వయోజన విద్యావిధానములో భావములయొక్క స్థానము అతి ముఖ్యమైనదని వేరుగా చెప్పనక్కరలేదు.

బాలురకన్న వయోజనులకు గ్రహింపు, శ్రద్ధ హెచ్చువుండుట చేత వయోజనులకు విద్య నేర్పుట బాలురకు నేర్పుటకంటె చాలా సులభం. అందుకుగాను సులభమార్గములను సూచించుచూ యిటీవల కొన్నిపుస్తకములు వెలువడి యున్నవి. కాని విద్య నేర్చుకొనుట సులభమైనంత మాత్రాన ఆ మార్గములు వయోజనులను ఆకర్షించకుండుట ప్రచారకుల అనుభవములో తెలిసిన విషయమే. ప్రచారకునకు ఎంత వుత్సాహం వున్నప్పటికీ వయోజన విద్యార్థులు

రాకున్నారు. ఆ విద్యావిధానములో వయోజన విద్యార్థులకు కావలసిన భావములు లేకుండుటయే దీనికి కారణం. చదువు వచ్చినంత మాత్రాన నాకేమి ప్రయోజనమని కూలి, రైతు, వ్యాపారస్థుడు కూడా ప్రశ్నించుకొనుచున్నాడు. వారివారి వ్యాపారములకు తగు భావములు, వారికి గరుపు చదువులో వున్నగాని వయోజనవిద్యా ప్రచారం ఫలించదు. భావాభివృద్ధికొరకు భాష నభ్యసించుతారు గాని భాష వచ్చినపిదప భావములు వచ్చునని వయోజనులు వేచి యుండరు. ఇతర వాఙ్మయములలోని భావములు గ్రహించుటకు పరిశోధనలు జరుపుటకు క్రొత్త క్రొత్త భాషలను అభ్యసించుట మనకు తెలిసిన విషయమే. అందుచేత వయోజన విద్యాప్రచారమందు భావనిర్ణయమును చేసుకొని దానికి భాష తోడుచేయవలసి వున్నదేగాని భావరహితమైన భాషాజ్ఞానం ప్రజల నాకర్షించదు.

బానిసదేశములలో సంఘబలం ప్రభుత్వమునకు విరోధము కావచ్చు. అంచేత ప్రభుత్వం విద్యాప్రచారమునకు అడ్డు తగులుచుండును. ప్రాథమికవిద్యను నిర్బంధించుటకు ప్రభుత్వం బాధ్యత తీసుకొనుటలేదు. ఇంతేకాదు, దేశాభివృద్ధికోరి సంఘబలమునకై భావ ప్రచారం చేయుటకుగాను కృషిసల్పువారు వయోజన విద్యాప్రచారమును పూనుకొన్నప్పుడు కూడా ప్రభుత్వము అడ్డు వచ్చుచున్నది. క్రిందటి సంవత్సరం ప్రభుత్వము వయోజన విద్యాప్రచారమును నిషేధించుచూ జారీచేసిన వుత్తర్వు దేశాభివృద్ధికి అడ్డుపడుచున్నది. ఆ వుత్తర్వును తొలగించటానికని ప్రయత్నం చేయుచున్న సంస్థలను, వ్యక్తులను అభినందించవలసి యున్నది.

ప్రత్యేక భావములకు ప్రాముఖ్యతనిచ్చి వాటి ప్రచారమునకై వయోజనవిద్య గరపు సంస్థలు కాలానుగుణ్యముగా ప్రతిదేశములోను వచ్చుచుండుట సహజమే. అట్లే భారతదేశములో కూడా వెలయుచుండుటలో ఆశ్చర్యములేదు. వారి భావములు అమలులో వున్న రాచకీయ నైతిక సిద్ధాంతాలకు విరుద్ధమైనపుడు వచ్చు సంఘర్షణలను ఎదుర్కొనుటకు అట్టి సంస్థలు సంసిద్ధముగానే వుండును. ఇవి

గాక నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము లేకపోవుటచేత నిరక్షరా స్యత హెచ్చుగావుండి పూర్వాచార పరాయణత్వముమీద అలవాటు పడియున్న భారతదేశమందు వయోజన విద్యాప్రచారం అత్యవసరం. ప్రత్యేక సంస్థలందలి భావములను మినహాయించినను, అన్ని వయో జన విద్యాసంస్థలకూ భారతదేశమందు ఒక భావము సామాన్యంగా వుండవలెను. అదేదనగా భావవిప్లవములు పొందకుండా ప్రాచీన నాగరికతాభిప్రాయములనే అనుసరించుచున్న భారతీయులలో భావ దాస్యం విస్తారంగా వుంది. భయవిస్మయములకు లోబడివున్న ప్రాచీన మనుజులు తమ జీవితము ప్రకృతి శక్తులవల్ల నడపబడుచున్నదని ఎట్లూహించిరో అట్లే యీ రోజునకుకూడా వూహించుట భారతీయు లలో సర్వసాధారణంగా వుంది. ఇట్టి భావమువల్ల భారతీయుడు తన స్వేచ్ఛను గుర్తించుకొనలేకున్నాడు. తన కతీతమైన శక్తులచేత తన జీవితము నడపబడుచున్నదని యితడు నిస్పృహచెంది బానిసభావ ములో మునిగివున్నాడు. ఇట్టి బానిసభావమే భారతీయులను ఆర్థిక రాచకీయములలో బానిసలుగా వుంచుచున్నది. ఈ బానిస భావం ఖండింపబడవలయును. ఆర్థిక రాచకీయ సంస్థలు, కులమత భేదములు మానవ కల్పితములనియు, తన సౌఖ్యమునకు అవి అడ్డు వచ్చినచో తాను వాటిని మార్చుకొనుటకు తనకు స్వేచ్ఛకలదనియు భారతీయుడు గుర్తించువరకు భారతదేశమునకు కష్టములు తొలగవు. ఇట్టి భావదాస్యమే కొంతవరకైనా యితరదేశముల ప్రజల్లో కూడా వుండుటచేతనే ప్రభుత్వములలో స్వార్థం పెరిగి దేశమును యుద్ధ సం క్షోభములలో ముంచుచున్నవి. ప్రపంచము-ముఖ్యముగా భారతదేశం యీ కష్టములనుండి తప్పించుకోవలెనంటే మానవుడు భావదాస్య మును విడిచి తన స్వేచ్ఛను గుర్తించుకొనవలెను. మానవుడు పూర్వ భావములకు అలవాటుపడి యుండుటచేత ఆధునిక అభివృద్ధులను గుర్తించుకొనలేక తనకుగల స్వేచ్ఛను గ్రహించలేకున్నాడు. మానవ స్వేచ్ఛయొక్క ప్రాముఖ్యతను తెలియచెప్పుట వయోజన విద్యావిధా నమునకు ఒక ముఖ్యమైన భావముగా తీసికొనవలసి యున్నది. ఇట్టి

భావము ప్రజాసామాన్యముయొక్క జీవితముతో సంబంధించి వుండుట చేత వారి నాకర్షించి వారికి ప్రబోధమును కలిగించును. ఇతర ప్రత్యేక భావములతోపాటు యీ మానవ స్వేచ్ఛ అను భావమును విద్యా ప్రచారములయందు చెప్పవలసియున్నది.

---

## లాబాక్ అక్షరాభ్యాస పటము

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, ఎం. ఏ.
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు

అక్షరాస్యతను గురించి జరిగే చర్చలలో ఏవిధానాన్ని అనుసరించి అక్షరాభ్యాసము చేయిస్తే వయోజనులు విసుగుజెందకుండా వ్రాయనూ చదువనూ కనిష్ఠమితికాలములో నేర్చుకోగలరు అనే చర్చ కొంత ప్రాధాన్యము వహించియున్నది.

చదువు నేర్చుటకు వచ్చే వయోజనునకు చదువునెడల తీక్ష్ణాభిమానముంటే ఏవిధాన మవలంబించినా అతడు ఇతరునికంటె హ్రస్వతరకాలములో చదువను వ్రాయను నేర్చుకొంటాడనేది స్వయంప్రకాశము. అట్లనే బోధకుడు ప్రజ్ఞావంతుడై తన ఆకర్షణశక్తిచేత శిష్యుని తనవాణ్ణి చేసుకోగలిగితే ఏవిధానమంటే ఆవిధానాన్ని వినియోగించి కార్యసాధన చేయగలడనడము కూడ స్వయంప్రకాశమే. కాని ప్రపంచమునందు పూర్ణశ్రద్ధగల అభ్యాసాసక్తులుగాని పూర్ణప్రతిభగల బోధకులుగాని అరుదు. సామాన్యమానవుడు సౌలభ్యప్రియుడు. ఆకర్షకములున్నగాని వడ్డివంచి కూర్చోనడు. మహాజనప్రబోధానికి మన ముపయోగింప వీలగు బోధకులు మహత్తమాకర్షణశక్తిగలవారు కారు. కాబట్టి చదువు నేర్పడమెంత యాకర్షణముచేయవలెనో అంత యాకర్షణను చేయడానికి, ఎంత సులభముచేయవలెనో అంతసులభము చేయడానికి ఈయుద్యమమునందు పాల్గొనే బుద్ధిమంతులందరును ఆలోచించి యొక్కొక్క డొక్కొక్కమార్గము చూపుచు అనుసరించుచు వచ్చినారు. ఇప్పుడు ప్రచారమునందుండు అన్నిపద్ధతులలో కొన్ని కొన్ని గుణములున్నవి. అవి యన్నిటి వివరణమునుగాని విమర్శనుగాని ఈ వ్యాసమునందు నేను తలపెట్టలేదు.

ఫిలిప్పైను దీవులలో ప్రజలను నూటికి నూర్గురను అక్షరాస్యులను చేయవలయునను నుద్దేశముతో గొప్ప కృషిచేసి తన్మూలముగా ప్రపంచమంతటను ప్రఖ్యాతిపొందిన డాక్టరు లాబక్ అనువారు తనవిధానము భారతభూమికి గూడ పనికిరాగలదని తలంచి ఇచటికి వచ్చి కొన్ని భాషలలో నొక అక్షరాభ్యాస పటమును దాని వివరణముగా చిన్న పొత్తమును సిద్ధముచేయించి ప్రకటింపించినాడు. అట్టి భాషలలో తెలుగును ఒకటి. మనదేశమునందు తెలుగులోనేగాక అరవము మున్నగాగల యితర

భాషలలోను పాదిరీలు — వారినే మిషనరీలందుము — తమ మతములో చేరు బీదసాదలకు అధమము బైబిలు చదువుట యైనను అభ్యాసము చేయించవలెనని చాల కాలముగా శ్రమపడుచు వచ్చియున్నారు. లాబక్‌కు చాల ముందునుండియే బడిపిల్లలకు పుస్తకాలు తయారుచేసినట్లే అక్షరాభ్యాస పుస్తకాలు మిషనరీల పరంగా తయారయినవి కలవు. సుందరం గారి పుస్తకాలు, దేవరాజ్ గారివి, హైద్రాబాదువి ఈగణానికి చేరినవి. ఇవి యన్నిటికిని అధిష్ఠాన పోషకులు సి. ఎల్. ఎస్. సంఘము వారు. లాబక్ వారు ఇక్కడకి వచ్చినప్పుడు వారికి స్నేహము కుదిరినది కూడ సి. ఎల్. స్. వారితోనే. వారే లాబాక్ అక్షరాభ్యాస పటము ప్రకటించినారు. కాబట్టి నేటిదినము మిషనరీ ప్రచారకులు, ప్రభుత్వ ప్రచారకులు, బొమ్మలు సంగీతముల సహాయసంపత్తి కారణంగా ఇతరులు కూడ విరివిగా ఉపయోగించే పటము లాబక్ పటమగుచున్నది. మదరాసు కార్పొరేషనులో వయోజన విద్యాకేంద్రము ఏర్పరచి అచ్చట బోధనకు కుదిరిన పంతులకు శిక్షణ నిచ్చునప్పుడు నేనీ లాబక్ పటమును వినియోగించి చదువు చెప్పుట సంభవించినది. అందుచేత ఇందులోగల గుణములు లోపములు పరిశీలించి ఇతర ప్రయత్నములతో, ముఖ్యముగా ఇటీవలనే నేచేసిన ప్రయత్నములతో, తారతమ్యము లెంచుకొనుట సాధ్యమయినది. లాబక్ విధానమునందు (1) బొమ్మ (2) అక్షరము (3) పదము (4) పాట ఇవి ఆధారములు. మొదట 'ప' నేర్పదలచినాడు. దానికి పంది యను బొమ్మనుచూపి పల్కించును. ఆ పదములో మొదటి అక్షరమేమి యని యడుగును. 'ప' అను జవాబు తిసికొని పందిలో 'ప'ను చూపును. 'ప' మాత్రము నల్లసిరాలో అచ్చయి యుండును. తక్కిగలది ఎర్రసిరా. పిదప బొమ్మ 'పాము' ఉండును. వానిని పల్కించి 'పా' స్వరూపమును చూపును. ఆకార సూచకమగు '—ా' ను ఇందు ఆకుపచ్చ రంగులో అచ్చువేసి యుందురు. ఈ విధము పి, పీ, పు, పూ, పె, పే, పై, పొ, పో, పౌలు మొదటి వరుసనే నేర్పవలె ననుట ఉద్దేశము. కాని లాబక్ పటములో హ్రస్వదీర్ఘము లన్నిటిని పల్కించుటకు తగిన రంగుబొమ్మలీయలేదు. పిల్లి, పూవు, పెట్ట, పౌలములను మాత్రమిచ్చినారు. నేర్పునప్పుడు లోటుపడిన అక్షరాలకు బొమ్మలు సిద్ధముచేసుకొని చూపుడని మేము బోధించితిమి. లాబక్ పటములో నేర్పగోరిన రెండవ యక్షరము 'క' దీనికి 'కప్ప' బొమ్మ మాత్రము వేసినారు. 'కా' మొదలు 'కౌ' వరకు గల గుణింతములకు బొమ్మలు లేవు. అట్లే వారిచ్చిన యక్షరములన్నిటికిని సంభవించినది. దీనికి కారణమున్నదియనవచ్చును. 'ప' కు గుణింతములు నేర్పు నప్పుడు గుణింతాల స్వరూపములు చూపించితిమి. కాబట్టి మొదటి అత్వమాత్రానికి బొమ్మతో ఆరంభించి శ్రద్ధకుదిరితే తరువాతివి పై వరుసలో వలెనే యని చూపించవచ్చును. అంతేకాదు, మొదటి యక్షరము 'ప' ను నేర్పునప్పుడే దీర్ఘాల నన్నిటిని "పా, పీ, పూ, పే, పో యని అందరు పాడండి" అని పూర్ణకంఠమున పాడింతురు. అదేవిధముగా ప్రత్యక్షర అభ్యాస మప్పుడును పాడింతురు. పలుమారీ పాటరావడముచేత సామ్యము స్ఫురించుచునే యుండును గావున బొమ్మలసాయము ప్రాధాన్యమనినను అనవచ్చును. మరి పాట తోడ్పాటు హ్రస్వపు

గుణింతాలకు కుదురుటలేదు. 'ఉ' త్వము 'ప' కిచ్చునప్పుడు ఇతర వర్ణములకిచ్చునప్పుడు భేదిల్లును. అదియు వేరుగ చెప్పి కావలెను. అరవమున అక్షరములు తక్కువ కాబట్టి ఒక్కపటములోనికి అన్ని అక్షరములు అన్ని గుణింతములు ఇముడ్చగలిగినారు. అందులో సంయుక్తాక్షరము. లేర్పరచుటకును ఒక్కటే సూత్రము. హల్లుకు పైన చుక్కపెట్టి చేరవలసిన ముందు హల్లుతో కూర్చి వరుసను వ్రాయుట దప్ప వేరుపద్ధతి లేదు. తెలుగున నిట్టి విధానము కుదురదు. ఈ క్రింది వత్తులు

్క, ్ణ, ్య, ్హ, ్స, ్ష, ్ల, ్ఞ

ద్రుతము పూర్ణానుస్వారము మనకు ప్రత్యేకములు. పూర్ణానుస్వారమునకు లాబక్ పటములో తావున్నది. కాని దానిని ప్రత్యేకముగా నేర్పనుద్దేశము తత్కర్త కున్నట్లు కానరాదు. ఇతరవత్తుల కావిష్కారమే లేదు. ఇతరవత్తులమాట యట్లుండ ణ, హ, శ వర్ణములమాటయే యెత్తుకొనలేదు. మరి ప్రాణాక్షరముల మాటకేపోలేదు. ఇవన్నియు పోగా మొదట ఒకయక్షరమే అన్ని అచ్చుగుణింతాలతో నేర్పినపిదప ఆయక్షరము మనసులో నిలచుట కభ్యాసములిచ్చిరాయనిన అది కానరాదు. ఈపటముతో చేరి ప్రకటించిన చిన్నిపొత్తములో ఇదే 'పా' నే నేర్చెదను ఇదే 'పీ' నే నేర్చెదను అనురీతి పునరుక్తి తప్ప అభ్యాసములు లేవు. కారణము విదితము. రెండక్షరములు, పూర్ణానుస్వారము లైనా నేర్పనిది స్వల్పముగానైనా పదముల యభ్యాస మేర్పరచుట సాధ్యముగాదు. మొదటిదినములలో అ, ఆ లు నేర్పి తక్కిన అచ్చులను వదలినను వదలవచ్చును. గుణింతములలో 'ఐ' కార 'ఔ' కారములు మానివేసినను మానివేయవచ్చును. అవసరమయిన తరువాత నేర్పవచ్చును. కాని లోపించినవని చూపిన పైవానిలో కొన్నిరూపాలు అ ఆ లు కాని అచ్చులకు ముందు నేర్పడము మొదటినుండి అభ్యాసము లేర్పరించడము ఆవశ్యకము. మేము బోధించుటయందు రెండక్షరములయిన పిదప అభ్యాసపదములు వ్రాయించి నేర్పితిమి. అరవములో సులభముగా పటముకుదిరినదిగదా యని యనుకొని ఆమోస్తరు ముందిడుకొని పూర్తిగ విమర్శింపక తెలుగుఅక్షరపటము సిద్ధపరచిరని నాకు తోచినది. తెలుగులో అక్షరస్వరూపాలు గుండ్రటి యనుస్వారపు మార్పులు, తత్తండములు. ఆరూపసంబంధముల కుదిర్చి వర్గీకరించియు సౌలభ్యము చదువరికి సమకూర్చవచ్చును. ఈపటమున అట్టిప్రయత్నము చేయలేదు.

లాబక్ పటములోని గుణములు రంగులపటములు వేయడము, సరళాక్షరములకు ప్రాధాన్యమీయడము, అచ్చుగుణింతాలను ప్రత్యేకించి వేరురంగులలో నిరూపించడము, దీర్ఘాలను వినియోగించి పాటరూపకంగా చెవిని దూర్చడం అనునవి. వీనిని వినియోగించుకొని ఈపటమును సంస్కరించి పెంచడానికి, అభ్యాసపదాలకు వేరే పుస్తకం సిద్ధపరచడానికి, ఇంకొకపటము వేసి మహాప్రాణాక్షరములు, ప్రత్యేకపు వత్తులు, హల్ మాత్రమునకు గల సంజ్ఞతోగూడ నేర్పుటకు వీలున్నది. ఇందులోని

అక్షరములవరుసను ప, క, న, ద, డ, బ, త, య, ర, మ, చ, వ, ల, గ, ట, స, జ, అ లనుండి ప, ర, వ, ఘ, ల, ట అ, ద, క, న, స, ఆ, డ, బ, గ, య, ణ, చ, త, జ, శ, హ, అ ల క్రిందికిమార్చితే నా 'వయోజనవిద్య-మొదటిపుస్తకము' అభ్యాస పుస్తకముగ చక్కగా పనికివచ్చును. అందులోని అక్షరస్వరూప వివరమును అనుస్వార ప్రయోజనమును కూడివచ్చును.

---

## గ్రంథాలయములు - సామాన్య ప్రజలు

శ్రీ సూరపరాజు కోటయ్యగారు
శ్రీ ఎఱ్ఱాప్రెగడగ్రంథాలయము, గుడ్లూరు

నిరక్షరు లధికముగా గల మనదేశములో గ్రంథాలయములు విద్యా విహీనుల కుపయోగపడునట్లు ప్రయత్నించవలసి యున్నది. అక్షరాస్యతా ప్రచారముతో తృప్తిపడక, యథాస్థితిలోనే ముందువారి జ్ఞానాభివృద్ధికి గ్రంథాలయములు తోడ్పడు టవసరము. సాధారణముగా నిప్పుడు గ్రంథాలయము లన్నియు పఠనాభిలాషగల విద్యావంతులకు తప్ప, విద్యా విహీనులకుగాని చదువ నభిలాషయే లేక కాలము వృథాచేయువారికి గాని ఉపయోగపడుట లేదనుట అతిశయోక్తి కాదు.

ఇట్టివారి నందఱను గ్రంథాలయ మాకర్షించినయెడల గ్రంథాలయముకూడ సత్వరాభివృద్ధి గాంచుటకు మంచి వీలుకలుగును. అయితే యిట్టివారిని గ్రంథాలయమున కాకర్షించుట సులువైన పని కాదు. కాని వీధినాటకములు- తోలుబొమ్మలాటలు- బుఱ్ఱకథలు- గ్రామఫోనులు మొదలగు సాధనముల నూతగాగొని కొంతవఱకు వీరి నాకర్షించి, అక్షరజ్ఞత కాకపోయినను, రాజకీయ, నైతిక, సాంఘిక, భూగోళ, ఆరోగ్యాది విషయములను కథలరూపమున వారికి బోధింపవచ్చును.

సాధారణముగా గ్రామములలో జరుగు గ్రామజాతరలు, తిరునాళ్ళు మొదలగు సమయములందు సామాన్యప్రజలు విశేషముగా

కూడుచుందురు. అప్పుడొక వైపు వయోజనవిద్యా ప్రచారకులుచేరి తమాషామైన కథలమూలమున వారిలో విజ్ఞానవ్యాప్తి జేయవచ్చును.

అక్షరాస్యతా ప్రచారమునకు ముఖ్యమైన సాధనము రాత్రి పాఠశాలలు. ప్రస్తుత మమలులోనున్న ప్రాథమిక విద్యాచట్టము నను సరించి రాత్రిపాఠశాలలు నిర్వహించువారికి ప్రభుత్వమువారు ధన సహాయముచేయ వీలున్నది. ప్రభుత్వ శాసనానుసారములగు పాఠ శాలలు దేశాభిమానము కలిగించు విద్యను బోధింపలేకున్నను, అక్ష రజ్ఞతను కలిగించుటకును, భూగోళ- శారీర- ఆరోగ్య శాస్త్రములు మొదలగు విషయ పరిజ్ఞానము కలిగించుటకు వీలుకలదు. ఈ పాఠ శాలలోని బోధన రెండుభాగములుగా విభజించవచ్చును. మొదటిది నిరక్షరులకు అక్షరజ్ఞత కలిగించుట, రెండవది కేవల అక్షరజ్ఞులైనవా రికి విషయజ్ఞానము కలిగించుట. ఈ పాఠశాలలు గ్రంథాలయ నిర్వా హకముక్రింద స్థాపించి, విద్యాశాఖాధికారుల అనుమతిని పొంది ట్రైనింగు పొందిన దేశాభిలాషగల ఉపాధ్యాయుల నియమించి, పాఠ శాలల నిర్వహించుచు ప్రభుత్వమునుండి ధనసహాయమును పొందవ చ్చును. ఇందుకు గ్రంథాలయ నిర్వాహకులు ధనము వెచ్చింప నవ సరముండదు. ప్రభుత్వమువారు ఉపాధ్యాయుల విద్యాయోగ్యత ననుసరించి చేయు ధనసహాయములో ప్రస్తుత నిబంధనల ననుసరించి నూటికి 15 వంతు ధనమును పాఠశాల నిర్వహణమునకు ఖర్చుచేసి మిగత ధనము ఉపాధ్యాయుల కివ్వవచ్చును. ఇట్టి పాఠశాల లిప్పుడు కొన్ని గలవని తెలియుచున్నది. ఈ విధానము ప్రతి గ్రంథాలయము వారు ఆచరణలో నుంచునట్లు ప్రోత్సహించుటయెగాక ప్రభుత్వము వారినికూడా యిందుకు సుముఖులుగా చేయుటకు ఆంధ్రదేశ గ్రంథా లయ సంఘమువారు తోడ్పడిన మేలుగా నుండును. ఈ నా అభి ప్రాయ మెంతవఱకు ఆచరణీయమో యోచించుటకై ఉద్యమాభి మానులను ప్రార్థింతును.

---

# వయోజనవిద్య – రష్యాదేశము

శ్రీ యాతగిరి లక్ష్మీ వేంకటరమణగారు
ధర్మగ్రంథాలయ ప్రతిష్ఠాపకులు

ప్రతి దేశమునందును రాజకీయపరివర్తనముతో విద్యాసంస్కరణము ప్రారంభమగుట చరిత్రప్రసిద్ధమై యున్నది. అమెరికాసంయుక్తరాష్ట్రములు, ఆంగ్లేయదేశమునుండి విడిపోయినపిమ్మటనే, ప్రజాస్వామికవిద్యను ప్రారంభించినవి. ఇంగ్లండుదేశమున కామన్సుసభా ప్రాముఖ్యము హెచ్చినవెంటనే నిర్బంధ ప్రారంభవిద్య అమలునందుంపబడెను. జర్మనీదేశమున నిరంకుశప్రభుత్వ మంతమొంది నూతన సాంఘిక జాతీయప్రభుత్వము ప్రారంభమయినపిమ్మట ప్రాతవిద్యాపద్ధతులన్నియు మార్చివేయబడెను. ఇటలీదేశమున కూడ నట్లే జరిగియుండెను.

రష్యాదేశములో క్రీ. శ. 1017 సం॥న జరిగిన రాజకీయపరివర్తనమునకు పిమ్మటనే అన్నివిషయములందును మార్పులుకలిగెను. ఆదేశమున విద్యావిషయమున జరిగినంత గొప్పమార్పు మరేదేశమునందును జరిగియుండలేదు. అనేక శతాబ్దములనుండి విద్యావిహీనతచేతను, దరిద్రముచేతను, అజ్ఞానముచేతను క్రుంగియున్న నూటయేబది మిలియనుల ప్రజాసమూహము నొక్కమారు సాంఘికముగా లేవనెత్తవలసిన బాధ్యత యాదేశనాయకుల నెత్తిపైబడినది. అటిస్థితిలోనున్న ప్రజలను లేవనెత్తుటకు మామూలు ధోరణిలో నొకశతాబ్దమైనను పట్టియుండెడివి. కాని సోవియటు జాతీయ నాయకులు తమయొక్క ఉత్సాహము, నిష్కపట్యము, పట్టుదల, విచక్షణజ్ఞానముల వలన పదిహేనువత్సరముల స్వల్పకాలములో, విద్యను సాధనముగా గొని, మనము కని విని యెరుగని ఆశ్చర్యకరమైన గొప్పమార్పును తమ సంఘమునందు కలిగించిరి.

జారుచక్రవర్తుల నిరంకుశపరిపాలనాకాలమున ప్రజాసామాన్యమంతయు విద్యలేక అజ్ఞానమున మునిగి దరిద్రముచే పీడింపబడుచుండిరి. విద్యాతృష్ణగల చక్రవర్తుల కాలములో స్వల్పముగా ప్రాథమికవిద్యను వ్యాపింపజేసెడివారు. సామాన్యజనులలో విద్యావ్యాపనమన్న నిరంకుశప్రభుత్వమునకు గుండెదిగులుగా నుండెను. మొదటి యలగ్జాండరుచక్రవర్తి కాలమున షిషుకోవుమంత్రి ప్రజలలో విద్య వ్యాపింపజేయుట వలన మంచికన్న చెడుగే యెక్కువ కలుగునని, రష్యనుచక్రవర్తుల యభిప్రాయమును వెల్లడించెను. విద్య వ్యాపించుటవలన ప్రజలలో స్వాతంత్ర్యేచ్ఛ యినుమడించి తమ నిరంకుశత్వమునకు అధికారమునకు భంగముకలుగునని వారిభయము. రష్యనువిప్లవమునకు పూర్వము నూటికి 30 మంది మాత్రమే చదువునేర్చినవారుండిరి. బడికిపోవు యీడుగలవారిలో నూటికి 5 గురు మాత్రమే పోవుచుండిరి. ప్రభుత్వ పాఠశాలలో కొలదిగ చదువుట, వ్రాయుట, లెక్కలుచేయుట నేర్పుచుండిరి. చాలకాలము మత

మును బోధించుటయందు గడుపుచుండిరి. అవిద్యార్థులలో స్వాతంత్ర్యబీజములు మొలకలెత్తకుండ పరీక్షాధికారులు కడు జాగరూకతతో కనిపెట్టుచుండిరి.

ప్రభుత్వము ప్రజలహస్తగత మయినవెంటనే సర్వజనులకు విద్యవ్యాపించుటకై జ్ఞానమందిరము తలుపులుపూర్తిగ తెరవబడినవి. సోవియటు యూనియనులో నున్న అన్ని రాష్ట్రములలోను నిరక్షరత్వమును నిర్మూలించుటకై యాజ్ఞాపత్రమును క్రీ. శ. 1919 సం. డిశంబరు 26 తేదీని లెనిన్ మహాశయుడు సంతకము చేసెను. ఈయాజ్ఞాపత్రము నమలునం దుంచుచు సుప్రీముకౌన్సిలు నాయన స్థాపించెను. ఉద్యమము యొక్క వివరములను కనిపెట్టి నడుపుచుండుటకు 1. పాఠశాలా నిర్మాణశాఖ 2. పఠనప్రణాళికశాఖ 3. పామరజన కార్యవిచారణశాఖ 4. ఆర్థికశాఖ 5. ఆలోచన శాఖ యను అయిదు ఉపసంఘము లేర్పాటు కాబడెను. అన్నిరాష్ట్రములందును సంఘములు, శాఖలు నేర్పాటు చేయబడెను. క్రమముగా పట్టణము లన్నిటియందును పల్లెలందును శాఖాసంఘములు యేర్పాటుకాబడెను. సుప్రీము కౌన్సిలువారు, ఉద్యమము సక్రమముగను త్వరితముగను దేశమున వ్యాపించుటకు తగు మార్గముల నన్వేషించి రాష్ట్ర మండల సంఘములకు తమ యుత్తరవుల నంపుచుండిరి. ప్రభుత్వస్థానమునున్న పార్టీవారే తమశాఖా సంఘములద్వారా ప్రభుత్వయాదరణ ప్రోత్సాహములపై స్వచ్ఛంద సేవకులమూలమున నీ యుద్యమమును నడపిరి. ఈపని యంతయు జరుగుటకు స్వల్పముగా నైనను ధనము కావలసి యుండెను. అది యెక్కడనుండి వచ్చునని తోచవచ్చును. ఈ సంఘములన్నియు స్వయంపోషితములు గావున ప్రతి సభ్యుడును నియమముగా కొంత చందా నిచ్చుచుండెను. యంత్రశాలలు మొదలగు సంఘములు విరాళముల నిచ్చినవి. చందాలు, విరాళములు కలిపిన మొత్తము, వ్రాత పరికరములు కొనుటకును, స్థానికసంఘముల సిబ్బందికగు ఖర్చుకును సరిపోయెను.

స్థానిక సంఘములు ప్రథమమున తమప్రాంతములో నుండు నిరక్షరుల సంఖ్యను విచారించి, పిమ్మట ప్రజలసామభూతిని సంపాదించెదరు. చదువు నేర్చిన వారును నేర్వనివారును కూడ నీయుద్యమమునకు సహాయపడిరి. యంత్రశాలలలోను, కర్మాగారములందును, పొలములయందును, స్వచ్ఛంద సైన్యములలోను, విద్యాభిలాషులున్న ప్రతిస్థలమందును ఒక పాఠశాల నెలకొల్పబడెను. ఈపాఠశాలలందు అసలు చదువురాని వారును, కొంచెముగా చదివిన వారును, చదివి మరచిపోయిన స్త్రీ పురుషులందరు 16 మొదలు 50 సంవత్సరముల వయస్సువరకు గల వారందరు చేరిరి. పెద్దలు నిర్మాణముచేసి ఆలోచనచెప్పుట యందును, యువకులు 13 సం. మొదలు 24 సం. వయసులోపువారు పాఠములు చెప్పుట యందును సాయపడిరి.

యువకులు పగటిపూట తమపాఠశాలలందును, కళాశాలలందును విద్యనేర్చి సాయంత్ర మీ రాత్రి పాఠశాలలలో విద్యనేర్పుచుండిరి. నల్లబల్లపై వ్రాయుటకు కుర్చీనెక్కవలసినంత పిన్నవయస్సుననే ఆయువకులు ఉపాధ్యాయత్వము వహించుచుండిరి. వారియుపాధ్యాయులు వారికి సలహా నిచ్చుచుండిరి. వయసుమీరిన స్త్రీ

పురుషులు దస్తరములను తమ చంకనిడుకొని ప్రతిదినము సాయంత్రము పాఠశాలలకు పోవుచుండిరి. కిటికీలగుండా వెలుతురు బయటకువచ్చు భవనములలోనికి వంగిచూచి నప్పుడు అట నొక పాఠశాలయు, నందు వయోజనవిద్యార్థులు బారులుతీర్చి వ్రాతపరికరముల ముందిడుకొని చదువుచుండుటయు గానవయ్యెను. పాపము! ఈ వయోజన విద్యార్థులు, తమ చిన్నతనమున చదువు నేర్చు యవకాశమును జారవిడిచిరి. ఈరాత్రి పాఠశాలలు విద్యను తమ యందుబాటులోనికి తెచ్చినవి. వీరు ప్రథమములో చదువు విషయమున నశ్రద్ధగానుండినను అక్షరజ్ఞానమువలన లాభము గ్రహించిన వెంటనే చదువుట ప్రారంభించిరి. ఈపాఠశాలలలో జీతము లియ్యవక్కరలేదు. పుస్తకములను సయితము ఉచితముగా నొసంగిరి. పట్టణములలో ప్రతిబ్లాకులోను 2 పాఠశాలలుండెను. అట్టి పాఠశాలలు వేలకొలది దేశమందంతటను యేర్పరుపబడినవి. వయోజనులలో నెంతవరకు విద్య వ్యాపించెనో తెలిసికొనుట కొక చిన్నయుదాహరణము కలదు.

ఒక ముసలియామె, డిపార్టుమెంటు స్టోరుప్రక్కన నివసించుచుండెను. అట నొక సైనుబోర్డు వ్రేలాడుచుండెను. ఆబోర్డు నామె తనజీవితకాలములో వేలసార్లు చూచియుండెను. కాని అదేమో ఆమెకు తెలియలేదు. ఈపాఠశాలలో చేరిన మూడువారముల పిమ్మట నొకసాయంత్ర మామె యాబల్లను తిరిగిచూచెను. ఆ నాడామె తన జీవితములో నెన్నడును పొందని సంతోషమును పొందెను. ఆమె కనుకొలకులనుండి ఆనందబాష్పము లప్రయత్నముగా నేలవ్రాలెను. ఏమది? ఆమె అబోర్డుపై నున్న యక్షరములను చదువగలిగెను.

ఈ విద్యాసంస్థలను నడపు ఉపాధ్యాయులు ప్రథమదశకు చెప్పువారు 4 సంవత్సరములును, రెండవదశకు చెప్పువారు యేడుసంవత్సరములును విద్యనేర్చి ఉపాధ్యాయ తరిబీయతు పొందియుండవలెను. ప్రాథమికపాఠశాలలో మొదటి రెండు సంవత్సరములు చెప్పవలసిన విద్య, ప్రథమదశ తొమ్మిదిమాసములలో నేర్పెదరు. తొమ్మిదిమాసముల యనంతరము చిన్నపత్రములు చదువుటయందును, చిన్న లెక్కలు వేయుటయందును పరీక్షింతురు. రెండవదశలో నాల్గుసంవత్సరముల ప్రణాళికను 9 మాసములలో పూర్తిచేయుదురు. దినమునకు రెండుగంటలచొప్పున విద్యనేర్పి పూర్తి ప్రణాళికను 18 మాసములలో ముగించెదరు. పిమ్మట విద్యార్థులకు పెద్దవాచకము నందును, చరిత్ర, భూగోళ, వ్యాకరణశాస్త్రములందును పరీక్షజరపి అక్షరజ్ఞపట్టముల నిచ్చెదరు. వారి వాచకపుస్తకములందు సాంఘిక, రాజకీయ, ఆర్థికవిషయములను తెల్పు పాఠములను చేర్చిరి.

ఈ పాఠశాలలందు విద్యనేర్చినవారు చదువు మరచిపోకుండుటకును, చదువుటయం దుత్సాహము, ఆసక్తి వారిలో వృద్ధిచెందుటకును, ఉద్యమ నాయకులు కొన్ని మార్గముల నేర్పాటుచేసిరి. వ్యవసాయము, పరిశ్రమలు, సైన్యమునకు సంబంధించిన నూతన విషయములు తెల్పు చక్కని సారస్వతమును ప్రచురించుచుండిరి. స్థానిక ప్రదర్శనశాలలకు విహారముల నేర్పరచిరి. తర్కసంఘముల నెలకొల్పిరి. సం

చార గ్రంథాలయముల మూలమున గ్రంథముల నందించిరి. వార్తాపత్రికలను గోడలపై నతికించుచుండిరి. పైని వివరింపబడిన సాధనములవల్ల చదువరుల సంఖ్య అపరిమితముగా పెరిగినది. చదువరుల సంఖ్యతోపాటు గ్రంథజాలముకూడ వృద్ధినొందినది. మాస్కో, లెనిన్‌గ్రాడు మొదలగు పట్టణములందు వందలకొలది పుస్తక విక్రయశాలలు గలవు. వేలకొలది గ్రంథములను చదువరులు కొనుచుందురు. ఆ దృశ్యము చూచుట కానందముగా నుండును. పట్టణములందు నిరక్షరులగువారిని గాంచుట యరుదు. పల్లెలలో నైనను జాలమంది చదువు నేర్చినవారే. ప్రస్తుతము రష్యా జనసంఖ్యలో నూటికి తొంబదిమంది చదువు నేర్చినవారై యున్నారు.

రష్యనుల రాజకీయాభిప్రాయములతో మన మేకీభవింపకున్నను, నిరక్షరత్వమును నిర్మూలించుటకు వా రవలంబించిన విధాన మెంతయు శ్లాఘాపాత్రముగానున్నది. హిందూదేశములో ప్రస్తుతము చదువు నేర్చినవారు నూటికి 16 గురు మాత్రమే యున్నారు. వెంటనే నిర్బంధ ప్రారంభవిద్యను అన్ని రాష్ట్రములలో ప్రవేశపెట్టినను, అందరును అక్షరజ్ఞులగుటకు అధమము రెండు పురుషాంతరము లైనను పట్టును. స్వల్పకాలములో దేశము విద్యావంతము కావలె ననిన, రష్యనుమార్గము ననుసరింపక తప్పదు. భారతదేశమున నుత్సాహవంతులగు యువకులున్నారు. వలయు ధనసహాయము గూడ లభించును. జాతీయవాదులు గ్రామ పునర్నిర్మాణమునకు బూనుకొని యున్నారు. ప్రభుత్వప్రోత్సాహము లభించుట కిసుమంతయును సందేహము లేదు. మన కర్షకులును, కార్మికులును వృద్ధిపొంది, యితర దేశసులతో పోటీకి నిలువవలెనన్న, విద్యావంతులు కావలెను. నూతన మార్గముల నన్వేషింపవలెను. కావున నో గ్రంథాలయ సోదరులారా! మీరు జాగుసేయక నిరక్షర నిర్మూలనోద్యమమును పెద్దపెట్టున కొనసాగించి, కృతకృత్యు లయ్యెదరుగాక?

---

# సాంకేతిక శాఖా సమావేశము

## పుస్తకము చదువుట *

శ్రీ గా. హరిసర్వోత్తమరావుగారు, ఎం. ఏ.
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు

'పుస్తకము చదువుట' అనే ఆచారము మనదేశములో కొంతకాలము క్రిందటివరకు సర్వసామాన్యంగా ఉంటూ ఉండింది. కొంత అక్షర జ్ఞానము అలవడిన పిల్లలకు అవి జారిపోకుండా అభివృద్ధి కావడానికిని అందరికి హృదయాకర్షకంగా ఉండు భాగవత, రామాయణ, భారతాది గ్రంథసామగ్రి ప్రచారంలో ఉండడానికిని ఈ ఆచారం ఏర్పడి యుండేది. ఆకాలంలో వాఙ్మయమంటే పద్యకావ్యాలనే భావము. దానిలోను భాగవతానికి విస్తారప్రచారము. అందులోను గజేంద్ర మోక్షము, రుక్మిణీకళ్యాణము, ప్రహ్లాదచరిత్రలకు అగ్రస్థానం. సాధారణంగా వినికిడి ఉండడంచేత, అంతేకాదు, కొన్నికొన్ని పద్యాలు అదివరలోనే ప్రార్థనరూపకంగా ఇతరత్రా వల్లించడం రూపకంగా కంఠోక్తి యయి యుండడంచేత చదువను ఆరంభించినవాండ్లు చాలా చిన్న వయసులోనే ఈగ్రంథాలు ముందిడుకొని రాగయుక్తంగా పద్యాలు సాధించేవారు. వారు చదువుతుంటే ప్రక్కనున్న అనుభవజ్ఞులైన పెద్దలు తాత్పర్యం చెపుతూ వ్యాఖ్యానాలు చేస్తూ ఉండేవారు. ఆసక్తి కలవారు మరి యితరులు వినడంకూడా ఉండేది. ఈ ఆచారానికి సంబంధించిన కథలు-తమాషాలుగా- కొన్ని ప్రచారంలో ఉండేవి. ముఖ్యంగా ఇద్దరుపిల్లలు- ఒకడు గజేంద్రమోక్షము, మరియొకడు రుక్మిణీకల్యాణము చదువుచుండడము 'మానవాధీశ్వరా మణువునాలుకవాడు' అని యొకడుచదువగా రెండవవారు 'ఇనుము ఇదర్భదేశమున ఈరడికుండెను' అని పూర్తిచేయడము, ధనియాలమ్ముకొనే శెట్టిగారా రాత్రి కచటమకాంచేసియుండి "చూడండి, పోతన ఎంతటివాడో, రుక్మినీ

* సాంకేతిక శాఖాసమావేశపు అధ్యక్షోపన్యాసము.

కల్యాణానికీ గజేంద్రమోక్షానికి లంకెపెట్టినాడ"నడము ఈరీతిగా అల్లిక అల్లింది మాచిన్నతనంలో చాల విశేషంగా వింటూఉంటిమి.

చదువుల పద్ధతులు మారడంచేత, నాగరికాలు ముదరడంచేత ఆ'పుస్తకంచదివే' ఆచారం అంతరించింది. ఈ ఆచారంలోని సూత్రాలు గ్రహించి నేటికీ దీనికి సదవకాశం కలుగజేయడం జరుగదగిన పనులలో ఒకటి. అక్షరాలు అభ్యసించి త్వరలో చదవడం నేరువదగినదని అంద రినీ ప్రబోధించే ఈ ప్రజాయుగంలో అట్టి సదవకాశం ఏర్పడుతుందనే నానమ్మకము. వయోజనునికి అక్షరం నేర్పడానికి అతనిని ఆకర్షించ వలెగదా! అందుకు పాటలు పద్యాలు వినియోగపడి తీరవలెను. ఆ పాటలు పద్యాలకు సంబంధించిన వాఙ్మయమునే వారికి 'చదువు గోష్ఠులు'క్రింద, రీడింగుసర్కిలులనే నవీనాచారముక్రింద, నిర్ణయింప వచ్చును.

'పుస్తకము చదువడం' అనడాన్ని ఈమాత్రము అర్థముతో ఈనేటికాలంలో పూర్తిచేయడం వీలుకాదు. నేడు వయోజనులయిన వారికి అనంతముఖాల విజ్ఞానము అవసరమయినది. ముద్రణకార్యా లయాలనుంచి వేనవేలు గ్రంథాలు అచ్చయి బయటపడుచున్నవి. భౌతికశాస్త్రాలు, వృత్తివిద్యలు, కళలు, దేహారోగ్యము, రాజకీయ ఆర్థిక సాంఘిక విషయాలు, అన్నిటిలోను ప్రజాసామాన్యానికి అభి రుచి కలుగుచున్నది. ఆయభిరుచిని తీవ్రంగా కలిగించి వ్యాపింప జేయడము దేశహితుల ముఖ్యకర్తవ్యముగా ఏర్పడియున్నది. ఈకార్యము సాధించడానికే గ్రంథాలయాలు ఏర్పడుచున్నవి. ప్రతి యూరను ఏర్పడవలసియున్నవి. విశ్రాంతిగా కాలము పుచ్చడంకొరకు చదువుకొనువారు, తమ స్వాభిరుచులను తీర్చుకొనడానికి చదువుకొను వారు, తమకుండే వృత్తికౌశలాన్నిగాని కళాకౌశలాన్నిగాన్ని పెంపు చేసుకోడానికి చదువుకొనేవారు వగైరా అన్నిరకములవారును గ్రంథాలుచదువడము అవసరమగుచున్నది. ఒకేవిషయమును గురించి వందలపుటల గ్రంథాలు వేనవేలుంటే తానుకోరినసంగతి కనుగొను టకు — ఒక్కొక్కప్పుడు చాల చిన్నసంగతే కావచ్చును — ఇంత

సముద్రంలోను మునిగి అవస్థపడవలసిందేనా అనేది ప్రశ్న. పుస్తక మంటేయేమో, అందులో ఏయేబాపతు తెలివిడి ఉంటుందో, ఫలానా విషయము కావలెనంటే ఫలానాచోట వ్రేలుపెట్టి తీయవచ్చును అనేసంగతి తెలిసిఉంటే ఈప్రశ్న కలుగనేకలుగదు. అట్లు తెలిసికో డానికి నేటిదినము చదువరికి తగినంతసహాయం గ్రంథంలోనే ఉండ వలెననే నీతి గ్రంథకర్తలు ప్రచురణకర్తలు అంగీకరిస్తున్నారు.

## ముఖపత్రము

అచ్చయిన ఏపుస్తకం తీసుకొన్నా ఎంతకాలంక్రిందట అచ్చయిన దయినా, ముఖపత్రమొకటి ఉంటుంది. దానిమీద పుస్తకంపేరు, గ్రంథకర్తపేరు, ఒకొకప్పుడు సంపాదకునిపేరు, ప్రచురణకర్తలపేరు, ముద్రాపకులపేరు, ముద్రించినస్థలము, ముద్రించిన సంవత్సరము, వెల, ఈ వివరాలన్నీ ఉండును. వీటిలో కొన్నిటినిగాని అన్నిటినిగాని అట్ట మీదవేసి అన్నిటిని లోముఖపత్రము నందు వేతురు. చదువుకొనే వారికి కొందరు గ్రంథకర్తలంటే, ప్రచురణకర్తలంటే ఎక్కువ గౌరవ ముంటుంది. అట్టివారిపేరు లేకపోతే వెంటనే ఆ గ్రంథాన్ని దూరము నెట్టి ముందుకు సాగవచ్చును.

నేటి పరిస్థితులలో అచ్చైనసంవత్సరము చాల ముఖ్యమగుచున్నది. ఉదాహరణం తీసుకొండి. ఆకాశవిమానాల సంగతి చదువదలచిన వారికి నిన్న నేడు వ్రాసినగ్రంథాలే ముఖ్యము. 20 ఏండ్లక్రిందట వ్రాసినగ్రంథంలో ఏమీఉండదు. ఈ20 ఏండ్లలోనే ఏడాదికేడాదికి ఎంతో ఎక్కువ అభివృద్ధి అయిపోయింది. కాబట్టి సంవత్సరంచూచు కొంటే ఎంతదగ్గరిసంవత్సరమయితే అంత మేలని ఆగ్రంథ ముపయో గింపనవును. గ్రంథము తాను సంపాదించదలచినవానికి ఇతరవివ రాలు ఆవశ్యకము. అయినకూర్పులు, వానిసంవత్సరాలు, ముద్రా పకులపేరు, ఆకూర్పునందు అచ్చువేసిన ప్రతులసంఖ్య వగైరా కొన్ని వివరాలు లోముఖపత్రానికి వెనుకవైపున అచ్చువేయడ మిప్పు డిప్పుడు ఆచారమవుతున్నది.

## పీఠిక

లోముఖపత్రమునకు తరువాత ప్రతిగ్రంథములోనూ "పీఠిక" అని గ్రంథకర్త వ్రాసే కొద్దిపాటి వ్యాఖ్యానమొకటి సాధారణంగా ఉంటుంది. అందులో గ్రంథకర్త తాను గ్రంథము వ్రాయడానికి హేతువేమి కలిగినదో, ఎవరు తన్ను ప్రోత్సహించినారో ఎవరెవరికి తాను గ్రంథము తయారుచేయడములో ఋణపడియున్నాడో వగైరాలు వ్రాసి వందనాలుకూడ చెల్లించడము కలదు. ఇట్టి పీఠికలో కొందరు కొందరు తమకు సాయపడిన ఇతరగ్రంథాలు — చాలాకొద్ది సంఖ్యగా ఉంటే ఏవో తెలుపడంకూడా ఉంది.

ప్రతికూర్పుకు పీఠికవ్రాసే అలవాటు ఉంది. కూర్పుకు కూర్పుకు మధ్యన విజ్ఞానం ఆగ్రంథవిషయమున క్రొత్తదిపెరిగి ఉండవచ్చును. లేదా అసలు గ్రంథకర్త అనుభవములు విస్తారతరమయి యుండ వచ్చును. మొదటికూర్పులోకంటె గ్రంథము పెరిగి యుండవచ్చు. పూర్తిగానే మారి యుండవచ్చు. తోడ్పడినవారు వేరయి యుండ వచ్చు. ఇట్టి వన్నిటిని తెలియపరుస్తూ 'రెండవకూర్పునకు పీఠిక', 'మూడవ కూర్పునకు పీఠిక' అని వ్రాస్తూ వస్తారు.

## ఉపోద్ఘాతము

పీఠికకు తరువాత పుస్తకాలలో చాలవరకు కానవచ్చేది "ఉపో ద్ఘాతము". కొందరు గ్రంథకర్తలు "పీఠిక" అనేది వ్రాయక అందు రాదగిన విషయాలను "ఉపోద్ఘాతము"లోనే చెప్పివేయడముకలదు. మరికొందరు గ్రంథకర్తలు తమగ్రంథములో క్రొత్తపోకడ లవలంబించి యుంటే లేదా గ్రంథనిర్మాణంలో క్రొత్తసూత్రాలు వేసుకొని ఉంటే లేదా ప్రకటించే గ్రంథము ప్రాతకాలమునాటిదయి కవి, కావ్య ములను గురించి చెప్పదలచివుంటే లేదా తమచరిత్రే తెలుపదలచు కొంటే "ఉపోద్ఘాతము" వ్రాసుకొందురు ఈనాడు "ఉపోద్ఘాతాలు" అను భాగాలను గ్రంథకర్తగాక సంపాదకుడు లేదా మరి ఇతరులో వ్రాయడం పరిపాటియయినది. అందులో గ్రంథకర్త ప్రశంస, గ్రంథ

కాలప్రశంస, గ్రంథప్రశంస ఉండడము సాధారణాచారము. "మున్నుడి" "తొలిపలుకు" "ఒకమాట" "ఇంట్రో" ఇటువంటి శబ్దసృష్టి ఇటీవల జరిగినది. ఇవి "పీఠిక"కుగాని "ఉపోద్ఘాతము"నకుగాని అన్వయించు చున్నవి.

"పీఠిక"ను "ఉపోద్ఘాత"మును చదివితే సామాన్యంగా గ్రంథములో విషయమేమిటి? గ్రంథకర్త ఎట్టివాడు? అతని అభిప్రాయాలు ఏమార్గ ములో నడచినవి? అతడు పండితులకొరకు వ్రాసినాడా? అందరికొరకు వ్రాసినాడా? పామరులకొరకే వ్రాసినాడా? వగైరా తేలిపోవును. ఇందులో ఏది తనకు నచ్చకున్నను చదువరి ఆగ్రంథము నవతలబెట్టి మరి తనయభిరుచికి అనువయిన గ్రంథాన్ని వెతుకుకొనవచ్చును.

"పీఠిక", "ఉపోద్ఘాతా"ల ఉద్దేశాలు మన ప్రాచీన వాఙ్మయములో 'అవతరణిక' గ్రంథకర్త, కృతిపతివంశాదిక వర్ణనము వగైరాలతో తీరుచుండినది.

## విషయానుక్రమణిక

"ఉపోద్ఘాత"మయినవెనుక "విషయానుక్రమణిక" అచ్చువేయుట ఆచారము. ఇందులో గ్రంథములో ఏమేమి విషయాలను గురించి వ్రాసియున్నదీ కొంతవివరం తేలుతుంది. ప్రతిపుస్తకమును అధ్యా యాలుగానో ప్రకరణాలుగానో ఆశ్వాసాలుగానో విభాగించిఉంటారు. కొందరు గ్రంథకర్తలు అధ్యాయాదుల సంఖ్యనిచ్చి దానిదానికి తా మిచ్చిన శీర్షికలను మాత్రము ఈ విషయానుక్రమణికలో చేర్చడం సాధారణపద్ధతి. కాని యిటీవల ఈపద్ధతి కొంతమారుతూఉంది. అనే కులు గ్రంథకర్తలు, ప్రచురణకర్తలు ఈ అధ్యాయాదికాలలో మధ్యే మధ్యే విషయాన్నిబట్టి తామిస్తూవచ్చు ఉపశీర్షికలను విషయాను క్రమణికలో విపులంగా చేరుస్తున్నారు. శ్రీ దిగవల్లి శివరావుగారు ప్రకటించిన ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రచరిత్రలోనేమి, శ్రీ గోటేటి జోగిరాజుగారు ప్రకటించుచుండే వ్యవసాయగ్రంథాలలో నేమి, ఈఏర్పాటు చాల చక్కగా అమర్చినారు. దీనిఫలితం చదువరికి

చాల ముఖ్యము. చెరకుపైరు చేసే చదువరి అనుకొందాం. ఎముకల ఎరువు ఈపంటకు వేయవచ్చునా అనే ప్రశ్న అతనికి తట్టింది. "ఎరువు" అనే శీర్షిక క్రింది ప్రకరణమంతా చదువనక్కర లేకుండా ఎరువుకు సంబంధించిన విషయానుక్రమణిక చూడడముతో అతనికి కాలహరణం లేకుండా సంగతి తేలిపోతుంది. "అకారాదిసూచీ" వేయని గ్రంథాలలో-మన దేశభాషలలో అకారాదిసూచీలుండడము సర్వసాధారణంగా అలవాటుకాలేదు-ఇట్టి విపులవిషయానుక్రమణికలు చదువరికి చాల సహకారులు. గ్రంథకర్తలీమార్గాన్ని అనుసరించడము అత్యవసరంగా తోచుచున్నది. ఈవిధంగా గ్రంథాదినే విస్తార విషయానుక్రమణిక వేయడం మన పురాణాదులలో ప్రాచీనకాలమునుంచి వచ్చినది. భారత భాగవతాదు లేవితీసుకొన్నా ఆశ్వాసము సంఖ్యయిచ్చి ఏయే కథలు, నీతులు వగైరాలు అందులో వరుసగానుండునో వివరించి యుందురు. ఇట్టి ఏర్పాటు ప్రబంధాలలో లేదు. ఆవశ్యకము కాదు కాబోలు. ఇంగ్లీషు మొదలగు భాషలలోను కావ్యనాటకాల కిట్టి ఏర్పాటుండదు. నవలలకును విస్తారతర విషయవివరణ వీలుకాదు. ఈ సందర్భమున మన పూర్వవాఙ్మయములో మరియొక చక్కనిఏర్పాటటనట గలదు. భారతము ఆరంభములోనే భారతకథ అంతటిని సంక్షేపముగా చెప్పినారు. మరి కొన్నిచోట్ల పూర్వకథ సంక్షేపించి చెప్పడము కాననగును. విషయానుక్రమణికకు ప్రాణము వివరములకు ఎదుటిప్రక్కన వచ్చునట్టి పుటలసంఖ్య. దానినిబట్టి ఏసంగతి ఎచ్చట నున్నది ఎక్కువ తడుముకోకుండ కనిపెట్టుకొనవచ్చును.

## చిత్రపటముల పట్టిక

చిత్రపటములు చేర్చియుండే గ్రంథములలో వీటి పట్టికను— ఏ పుటలో ఏ పుటకెదుట ఏ పటమున్నదను వివరాలతో— ఇత్తురు. ఇచ్చుట యావశ్యకము. "గండగుద్దలి" అనే ఉపకరణము వ్యవసాయములో ఉపయోగపడుతుంది. చదువరికి దాని స్వరూపము తెలియవలెను. జోగిరాజు వంటివారి వ్యవసాయ గ్రంథములలోని ఈ చిత్ర

పటముల పట్టికను చూచుకొంటే పని కుదురవలె. కాని శ్రీ జోగి రాజుగారీ అవకాశము రెండు గ్రంథాలలోతప్ప చదువరికి కలుగ జేయలేదు. వారును వారిబోటి రచయితలును గమనింతురుగాక. అవ సరమయినచోట్ల ఆపటముక్రిందే దాని వివర మెచ్చటకలది గ్రంథము పుట సూచించిడ మావశ్యకము. నేడు పాశ్చాత్యసీమలలో చిత్ర పటాల కీరీతి వివరణ లిచ్చుచున్నారు చిత్రపటములకు విషయవివ రణమునందు చాల ప్రాముఖ్యమును కలుగుచున్నది.

## మూలగ్రంథముల జాబితా

కథలు, కల్పనలు, కావ్యము లేవో కొన్నిటదక్క గ్రంథకర్త వ్రాసే విషయమంతా అతని బుర్రలోనుంచే పుట్టుక రావడము లేదు. ఇదివరలో నీ మూలగ్రంథాలు, ఇతరులు చేసిన పరిశోధనలు, వ్యాఖ్యానాలు ఎక్కువగా ఉపయోగించుకొనకుండా తప్పదు. అట్టిగ్రంథాలు, వ్యాఖ్యానాల జాబితా లివ్వడము ఆయా రచయితలకు కృతజ్ఞత చూపడాని కవసరమనడము నీతికి సంబంధించినది. చాలమంది గ్రంథ కర్తలానీతి కనుబరచరు. అది యెట్లున్నా చదువరి కృషికొరకట్టి వివ రము చేర్చడము గ్రంథకర్త ధర్మమని కనిపించుతుంది. ఎందువల్ల నంటారా? గ్రంథకర్త వ్రాసిన విషయము గ్రహించి ఆవిషయములోనే ఇంకా యెక్కువ విజ్ఞానం సంపాదింప దలచినా లేదా గ్రంథకర్త వ్రాతచే తనకుండే సంశయము చదువరికి తీరకపోయినా అతడు మూలగ్రంథాల నవలోకించి తన మనస్సంకల్పాన్ని తీర్చుకొనవచ్చును. అట్టి సహాయము తాను చేయక తన సర్వజ్ఞత్వమును చదువరి అంగీక రింపవలె ననడము గ్రంథకర్తకు ధర్మముగాదు. ఈవిషయమున తెలు గులో జోగిరాజుగారెన్నదగి యున్నారు. తాము విషయము వ్రాసే టప్పుడే వాక్యముపూర్తికాగానే ఒకఅంకె గుర్తువేసి మూలగ్రంథాల జాబితాలో అదేయంకెగల వ్రాత తమకాధారమని సూచించుచు పోయినారు. తాము పరిశోధన చేయనిచోట ఇది తాము పరిశోధించిన విషయము కాదని తెల్పినారు.

మూలగ్రంథముల జాబితాను కొందరు గ్రంథాంతమున ఇచ్చు టయు గలదు.

## అకారాదిసూచి

ఈ హంగంతా ముగిసిన పిదప గ్రంథ మారంభమవుతుంది. కాని అసలు గ్రంథభాగమును గురించి చెప్పుటకుముందు 'అకారాది' సూచిని గురించి వివరింపదగును. దీనిని గ్రంథాంతమున ప్రకటించుట యలవాటు. ఇంగ్లీషువగైరా పాశ్చాత్యభాషలలో ఇది సర్వేసర్వత్ర వాడుకయందున్నది. దీనివల్ల ప్రయోజనము గొప్పది. ఎన్సైక్లో పీడియా బ్రిటానికా అనునది ఆంగ్లభాషలో మహత్తమమయిన విశ్వ కోశము. ఇప్పుడు దాని సంపుటసంఖ్య 36. ప్రతిసంపుటమున రమా రమి 1000 పుటలుండును. ఇందులో విషయము శీర్షికలు అకారాదిగా ఏర్పడియున్నవి. కాని ఇన్నిసంపుటాలలో ఏ ఒక్కవిషయమో ఎక్కడ నున్నదో తెలియడం కష్టము. ఒక్కొక వ్యాసము దీర్ఘంగా ఉండి అందులో ఎన్నో ఉపశీర్షికలక్రింద వేరువేరు వివరాలుండడము కలదు. అంతేకాదు, ఇందులోని వ్యాసా లెంత సమగ్రంగా వ్రాసినా పరస్పర సంబంధముకల సంగతులు అనేక శీర్షికలక్రింద రావడము సంభవించు తుంది. దేశాన్నిగురించి వ్రాసే వ్యాసకర్త ఆదేశ వాఙ్మయాన్ని గురించి సంక్షేపంగా వ్రాసియుంటాడు. వాఙ్మయమును గురించి వ్రాసే వ్యాసకర్త ఇతర వాఙ్మయాలతో దానినిపోల్చి దేశానికి ప్రాముఖ్యమీయని రీతిని వ్రాసిఉంటాడు. ఒక వ్యాసకర్త ముఖ్యము కాదనుకొన్న సంగతులు రెండవ వ్యాసకర్త ముఖ్యమని విపులీకరించి ఉంటాడు. అంతేకాదు, ఒక మహద్విషయమునుగురించి వ్రాసేటప్పుడు ప్రాస్తావికంగా అనేకవిషయాలు అందులో కలిసిపోయి యుండును. ప్రాస్తావికంగా దొర్లిన మాటలే ఒకొకప్పుడు చాల విలువగలవిగా ఉండవచ్చును. ఈకారణములచేత ఏముఖ్యపదము, ఏవిషయము, ఏవ్యాసములో నమూదైంది తెలియగలిగితే చదువరి తప్పకుండా దానిని చూడవలెననే అభిలాషకలవాడవుతాడు. కాబట్టి 'అకారాది'గా ఉండే ఎన్సైక్లోపీడియా బ్రిటానికాకు మళ్లీ అకారాదిసూచి ప్రత్యేక

మొకసంపుటము. అంటే 5-6 వందల పేజీల గ్రంథము ఏర్పడియున్నది. ఇందులో యిచ్చే ఆచూకీ చాలా బాగుంటుంది. ఈసంపుటలోని సూచీలో ఒకపదం తీసిచూస్తే అది ఏయే సంపుటములో ఏయే పుటలో తటస్థించేది తెలుస్తుంది. ప్రతిపుటలోను రెండు కలములుగా గ్రంథము అచ్చయి ఉన్నది. ఆరెండు కలాలను నాలుగు భాగాలక్రింద ఆలోచించి ఏ, బీ, సీ, డీ అని ఎడమకాలం పైసగము ఏ, క్రింది సగము బీ, కుడికాలం పైభాగము సీ, క్రిందిసగము 'డీ' అని సంకేతా లేర్పరచి ఆనాలుగు సగాలలో ఏ సగంలో చూడవలసింది కూడ సూచించుతారు. మరి సూచించిన స్థలంలో ఆపదము సందర్భమున ఏవివరముందో టూకీగా వ్రాస్తారు. 'ఇండియా' అనే పదంక్రింద సంపుటము 8 పుట 359 భాగము 'ఏ' అని ఉంటుందనుకోండి. అచ్చట "బరుకు-బిల్లు" అని వ్రాస్తారు. అంటే ఆ వివరముందని తెలుస్తుంది. ఇంత చక్కని ఆచూకీ దొరికినప్పుడు చదువరి వేలకొలది పుటల గ్రంథాన్ని తన పనుల కెంతసులభంగా వినియోగించుకోవచ్చునో వేరే వర్ణించవలసిన పనిలేదు. అన్నిటిలోను ఇంత విస్తార ప్రయత్నమక్కర లేకున్నా సాధారణంగా ప్రతి ఇంగ్లీషు గ్రంథములోను ఇటువంటి 'అకారాది' సూచీ ఉంటుంది. మన భాషల గ్రంథాలలో ఇది ఉండడము చాలా అరుదు. భగవద్గీతాది సంస్కృత గ్రంథాలలోని శ్లోకాల మొదటి పదాల కకారాది సూచీ ప్రకటించడము కలదు. దాని యనుకరణంగా ఇటీవల శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారు ఆముక్తమాల్యదేత్యాది గ్రంథాలకు తెలుగున పద్యాలసూచీ ప్రకటించినారు. అకారాదిసూచీ నాకు ఎరుకయున్నంతవరకు చాల చక్కగా ఇటీవల ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్రచరిత్ర' ప్రకటిస్తూ శ్రీ దిగవల్లి వెంకటశివరావుగారు చేర్చినారు. అంతకు మించి మరి ఏ గ్రంథకర్తగూడ అకారాదిసూచీ ఇచ్చుటలేదు. ఇది తెలుగు గ్రంథకర్తలు జాగ్రత్తగా ఆలోచింపదగిన విషయము.

సహాయభూతమైన ఎన్నిహంగులు కుదిరినా చదువరి అసలు గ్రంథము చదివితే పొందగలఫలము ఇతరత్రా పొందగలడనము

కుదురదు. కాని మహత్తమంగా గ్రంథాలచ్చవుచుండే ఈ దినాలలో అన్నిగ్రంథాలు మేమేకడ చదువుకొందుమనేవారు ఉండక తప్పదు. వీరికేమిసలహా? అయ్యా, కొన్నిగ్రంథాలైనా మొదట చక్కగా చదువుకోండి. అంతవరకు మీదృష్టి అక్షరాలు పదాలమీద త్వరగా ఆనడము, ఆనడముతోనే అచ్చటి భావము మెదడుకు స్ఫురించడం, స్ఫురించడముతోటే రచయిత ముందుకేమి చెప్తాడో ఊహించుకోవడము, ఆఊహతో ముందువాక్యాల చదువు గబగబా పరుగెత్తడం సంభవింపదు. ఇది కొంతవరకు సంభవముచేసుకొంటే వేలపేజీల గ్రంథాలను కూడ గంటలకాలంలో త్రిప్పివేసి మీరుపట్టుకోదగిన అంశము అందులో ఎక్కడుందో కనుగొని వివరంగా దాన్నిచూచుకొనే అవకాశం కలుగుతుంది. సాధారణంగా చక్కగా వ్రాసిన గ్రంథాలలో—ఇవి భావకవిత్వాలకు ప్రబంధాలకు కథలకు అంతగా అన్వయింపదు— విషయము పేరాలు పేరాలుగా విడదీసి ఉంటుంది. సాధారణంగా ఒక్కొక్క పేరాలో ఒకొక్కభావము విపులీకృతమై ఉంటుంది. పైనచెప్పిన రీతిని త్వరగా చదివే అలవాటుపడినవారు పేరాలోని మొదటివాక్యము తుదివాక్యములమీద కన్నుఆనడంతో అందులో తమకు కావలసిన భావవస్తువు దొరికిందా లేదా అనేది నిర్ణయించి ముందుకు కంటిని పరుగెత్తించగలరు. నేటిదినము చదువు అభ్యాసం అనేదానిలో ఉన్నతంలో ఉన్నతమైన మెట్టు ఇది. ఈమెట్టెక్కిన చదువరికి పైహంగంతా కొంతవరకు పనికివచ్చినా ఈ త్వరితస్ఫురణశక్తి మహత్తమముగా ఉపయుక్తమవుతుంది.

గ్రంథమెందుకుంది? మీ ఉపయోగంకొరకు- బీరువాలోపెట్టడానికిగాదు. దాని బైండింగు సౌందర్యము బంగారు నీటి అక్షరాల సౌందర్యం చూచిచూచి ఆహాహా గ్రంథాన్నెంత చెదరకుండా మాయకుండా పెట్టినామని మురిసేటందుకుకాదు. పైవిధంగా అన్నిఉపకరణాలను ఉపయోగించి త్రిప్పిత్రిప్పి పలుమారు పలువురు చదివి జీర్ణంచేసుకోవడానికే గ్రంథం. ఈప్రయత్నంలో గ్రంథము జీర్ణమయినా నష్టం లేదు. క్రొత్తది మళ్లీ సంపాదింపవచ్చును. చదువకుండా దాచుకోడానికి గ్రంథాలేల?

---

# గ్రంథాలయములు : పుస్తకముల సరిచూచుట

శ్రీ పాతూరి నాగభూషణం, డిప్. లిబ్. *

అన్ని వ్యాపారములందును, పదిమందికిచెందిన సంఘముల విషయములోను ఏడాది కొకపర్యాయము లెక్కలుచూచుకొనుట సర్వసామాన్యముగ జరుగుచుండును. ఈవిధానము గ్రంథాలయములందును అంతోయింతో అమలులోనున్న విషయమంద రెఱిగినదే.

ప్రతి నివేదిక వత్సరాంతమున ఆయాగ్రంథాలయముల కార్యదర్శులు, ఆయా సంవత్సరములలో తమ తమ గ్రంథాలయముల పక్షమున నడచిన కార్యక్రమమును తెలుపు నివేదికలను తయారుచేయుదురు. ఈనివేదికలలో ఒక్కొక్క సంవత్సరాంత మున గ్రంథాలయమునగల గ్రంథములు, బీరువాలు, తదితర పరికరములను గూర్చిన వివర ణము (Statement) ముఖ్యముగనుండును. తమ గ్రంథాలయముయొక్క అభివృద్ధిని ఇబ్బందులను వివరించుటలో గడచిన సంవత్సరారంభమునగల పుస్తకములు, నివేదిక కాలములో క్రొత్తగ చేర్చినట్టియు పోయినట్టియు పాత్రములు మున్నగువానికి సంబంధించిన విషయములు తెలుపబడుట సహజముగదా! అగుటచే సంవత్సరనివేదికల తయారుచేయుటకు పూర్వమొకపర్యాయము గ్రంథాలయములందలి పుస్తకాదుల లెక్క సరిచూడవలసిన అవసరముగలదు.

## ప్రయోజనము

గ్రంథాలయములో మొదటినుండియు సంపాదించిన గ్రంథములున్నవో లేవో తెలిసికొనుటకు మాత్రమేగాక— ఈ పరిశీలన నడచునప్పుడు మఱి కొన్ని ప్రయోజనము లును సిద్ధించుచున్నవి. పుస్తకములస్థితిని తెలిసికొనుచు బీరువాలఅరలలో క్రమము తప్పించి పెట్టబడిన గ్రంథముల గనిపెట్టుటకుమాత్రమేగాక ఈపరిశీలన మూలమున అరలు శుభ్రముచేయబడి అట్టకట్టవలసినట్టియు, బాగుచేయవలసినట్టియు, మార్చివేయ వలసినట్టియు, తొలగించవలసినట్టియు పుస్తకములను వేరుగ తీసియుంచుటకుకూడ నవకాశమేర్పడుచున్నది. మఱియు నీ పరిశీలనములో పుస్తకములెట్లు పోవునదియు గ్రహించుట కవకాశములుండి మున్ముందట్టిపొరపాటులు జరుగకుండునట్లు కట్టుదిట్టము చేయుటకు సహితము వీలగును.

## విధానము

గ్రంథాలయములందలి పుస్తకముల పరిశీలనవలని ప్రయోజనముల దెలిసికొన్న పిమ్మట దీని విధానమునుగూర్చి విచారించవలసియున్నది. ఈ పరిశీలన ఎప్పుడు జరుగవలెనను విషయము వివాదగ్రస్తమైనది. కొన్ని గ్రంథాలయములలో ఏటేట

---

* సేవాశ్రమవాణీమందిర పర్యవేక్షకుడు, పెదపాలెము

వార్షికోత్సవమునకు ముందు 3 మొదలు 2 దినములవరకు గ్రంథముల నెరవిచ్చుట మాని, చదువరులనుండి రావలసినగ్రంథముల నన్నిటిని వసూలుపఱచి, మొత్తముగ్రంథములను సరిచూచుకొన్న తదుపరి గ్రంథముల తిరిగి నిండ్లకిచ్చువాడుకగలదు. తమ వీలునుచూచుకొను గ్రంథభాండాగారుల కీవిధానము సుఖముగ దోపవచ్చును. ఎక్కువ ఉపయోగములోలేని గ్రంథాలయములలో దీనివలనమున నష్టమంతగ లేకపోవచ్చును. కాని గ్రంథాలయముయొక్క సేవయే ప్రధానమని యెంచు నేటి భాండాగారు లెవ్వరుగాని పుస్తకముల సరిచూచు నిమిత్తము గ్రంథాలయమును మూయుప్రయత్నమున కేమాత్రము సమ్మతించరు. పెద్దపెద్ద గ్రంథాలయములలో కొన్నివారములు వరుసను గ్రంథములు సరిచూడవలసియున్న పైవిధానమువలన చదువరుల కిబ్బందికలుగునను తలంపుతో— ఈచిక్కును తొలగించి గ్రంథాలయము యొక్క దైనందినకార్యక్రమమున కేమాత్రము భంగముకలుగకుండునట్లు సంవత్సరము పొడవునను—మధ్య మధ్య కొన్నిదినము లీపనినిమిత్తము కొంతకాలమును ప్రత్యేకించుచున్నారు.

పుస్తకముల సరిచూచునిమిత్తము ప్రత్యేకించబడవలసిన దినములు, ఒక్కొక్క దినమున పని జరుగవలసినకాలము గ్రంథాలయములో గల సంపుటముల సంఖ్యపైనను, ఇందునిమిత్తము వినియోగింపబడు మనుష్యుల పైనను, సంవత్సరకాలములో ఈ పని ఎన్నిదఫాలు జరుగవలెనో దీనిపైనను ఆధారపడియుండును. పెద్దపెద్ద గ్రంథాలయములలోని గ్రంథములు విషయమునననుసరించి విభజింపబడి ఆయావిషయములకు సంబంధించిన గ్రంథములు చదువరుల అనుకూలము ననుసరించిన వరుసలలో నమర్చబడును. ఇందు కొన్నివరుసల కడకు చదువరులు నేరుగపోవచ్చును. కొన్నింటివిషయమై చదువరుల కీ సౌకర్య మీయబడకుండుటయు గలదు. ఇట్లేర్పఱచబడిన వరుసలలో స్వేచ్ఛోపలబ్ధిగలవి ఈ సౌకర్యములేని వానికన్న మిక్కిలి పర్యాయములు సరిచూడబడవలెననుట నిర్వివాదాంశము. ఇరువురు మనుష్యులు వారమునకొక దినముచొప్పున పనిచేయుచు సంవత్సరకాలములో లక్షగ్రంథములుగల గ్రంథాలయమునందలి పొత్తములనన్నింటిని రెండుపర్యాయములు సరిచూచుటజరుగును.

ఇక అసలు పనిని పరిశీలింతము. నేటిప్రముఖ గ్రంథాలయములన్నింటిలోను గ్రంథవివరణపట్టికలు, గ్రంథవిభజనపట్టికలు మున్నగునవి పుస్తకరూపముననుండు రిజిస్టరులల్లో గాక కార్డులరూపమున సొరుగులలో నమర్చబడి తిరుగవేయుటకు సులువుగను, చూచుటకు హాయిగనునుండును. ఈకార్డులపద్ధతి కాలముయొక్క విలువను గమనించి, చదువరులయొక్కయు, సిబ్బందియొక్కయు కష్టమును తగ్గించుటలోను, పాఠకుల కెక్కుడు ప్రయోజనమును కలిగించుటలోను తోడుపడునట్లేర్పరుపబడిన నూతన వ్యవస్థ (Invention) యని చెప్పవచ్చును. ప్రతిగ్రంథాలయము నందును బీరువాలు, వానియందలి పుస్తకములవరుస ననుసరించి తయారుచేయబడిన కార్డులపెట్టెయొకటి యుండును. దీనినే 'షెల్ఫురిజిస్టరు' అందురు.

## ప్రచారములోనున్న గ్రంథములు

మనము సరిచూడదలచిన బీరువాలోని పుస్తకముల కార్డులుగలసొరుగును షెల్ఫ్ రిజిష్టరునుండి బయటకు తీయవలెను. నేటిగ్రంథాలయములలో పుస్తకములిచ్చి పుచ్చుకొను పద్ధతులుకూడ కార్డులతోనే జరుగుచుండును. ఒక్కొక్క పాఠకుడు గ్రంథాలయమునుండి ఒక్కసారిగ నెన్నిపుస్తకముల నింటికి తీసికొనిపోవ వీలుండునో అన్నిటిక్కెట్టులు వానికియ్యబడును. అతనికి పుస్తకమేదైన కావలసిన తనటిక్కెట్టును గ్రంథభాండాగారికిచ్చి తనకువలయు గ్రంథమును చూపినను లేక చెప్పినను సదరు గ్రంథమును భాండాగారి చదువరికిచ్చి గ్రంథములోనికార్డును పాఠకుని టిక్కెట్టుతో చేర్చి ఈరెంటిని తేదీలవారిగను, మరల ఒక్కొక్కతేదీ ఇండ్లకు గొంపోబడిన గ్రంథములను వర్గీకరణపు వరుస ననుసరించియు చిన్నిసొరుగులలో పేర్చును. గ్రంథాలయమునకు వచ్చువారిని, ఇందుండి బయటికి పోవువారిని కనిపెట్టి చూచుచు, వాపసు గ్రంథములను పుచ్చుకొనుచు, వలయువారికి గ్రంథముల నెరవిచ్చుచు, ఇందుకు సంబంధించిన రికార్డునంతటిని తన యధీనమున నుంచుకొని గ్రంథాలయ ముఖద్వారమున నుండు సహాయభాండాగారిని పరివేష్టించియుండు ప్రదేశమును ఆంగ్లమున 'కౌంటర్' అందురు. పైన తీయబడిన షెల్ఫ్‌రిజిష్టరు సొరుగును కౌంటరువద్దకు గొంపోయి అచ్చటనున్నవారికి తానానాడు సరిచూడబోవు గ్రంథములవర్గము, ఈవర్గముయొక్క పరిచయ సంఖ్యలవరుస తెలుపవలెను. తదుపరి కౌంటరులోనున్న యాతడు తనయధీనమందున్న కార్డులనుచూచి ఒక్కొక్కతేదీలో పై చెప్పబడిన వరుసకు సంబంధించిన పుస్తకముల పరిచయసంఖ్య*లను చదువునట్లు చేయవలెను. ఈకార్డులలో పుస్తకముల పేర్లున్నను సంఖ్యలను చదువుటవలన కాలము కలసివచ్చును. అతడట్లు చదువుచున్న సంఖ్యలకార్డులను షెల్ఫ్‌రిజిష్టరు సొరుగులో పైకి త్రిప్పియుంచవలెను. ఈకార్డులు మామూలుగ అడ్డముగనమర్చబడి ఎడమచేతిపైమూలయందు ప్రతిదానిపైనను పరిచయ సంఖ్య వ్రాయబడియుండును. కార్డులను పైనచెప్పినట్లు త్రిప్పుటలో పరిచయసంఖ్యలు స్పష్టముగ కానరావలెను. ఈపని ముగిసినపిమ్మట పైకి త్రిప్పియుంచిన కార్డులు ప్రచారములోనున్న గ్రంథములకు చెందినట్లు భావించవలెను.

## బీరువాల పరిశీలన

పై పనిముగియులోపల ఒకరిని గ్రంథాలయములో నాడు సరిచూడవలసిన బీరువాలలోని గ్రంథముల క్రమమును చక్కబఱచునట్లేర్పాటు చేయవలెను. వాపసు చేయబడిన గ్రంథములలోనుండి ఈవిభాగమునకు చెందిన గ్రంథముల నన్నిటిని తెప్పించి బీరువాలలో పెట్టించవలెను. ప్రచారములోనున్న గ్రంథములను కౌంటరువద్ద గుర్తుపెట్టుకొన్నపిదప ఈ బీరువాలయొద్దకేగి ఒకరిని వరుసను వందలిగ్రంథముల వీపుననున్న పరిచయసంఖ్యలను చదువమని మఱొకరు షెల్ఫ్‌రిజిష్టరు కార్డులలోని సంఖ్య

---

* ప్రతి పుస్తకమునకు వర్గసంఖ్య, పుస్తకసంఖ్య ఉండును. ఈ రెండును కలసిన సంఖ్యయే పరిచయసంఖ్య. దీని నాంగ్లములో 'కాల్‌నంబర్' అందురు.

లతో వీనిని సరిచూచుచు పోవలెను. మధ్య మధ్య నిలువుగనున్న కార్డులు తగిలినప్పుడు వానిని యథాస్థానమునకు త్రిప్పవలెను. బీరువాలో లేని పుస్తకములసంఖ్యలు షెల్ఫ్‌రిజిస్టరు కార్డులలో కనబడుచో అట్టికార్డులను విమర్శనార్థము వేరుగ నొక పెట్టెలో నుంచవలెను. ఒక్కొక్క పర్యాయము సరిచూడవలసిన గ్రంథవిభాగమునకు చెందిన పరిశీలన పూర్తియగుటతోడనే మిగిలినకార్డులను షెల్ఫ్‌రిజిస్టరుకు వాని క్రమమునను సరించి చేర్చవలెను.

## విమర్శన,

పరిశీలనలో కానరాని గ్రంథములేవో విమర్శనార్థము ప్రత్యేకించబడిన పైకార్డులనుబట్టి తెలిసికొనవచ్చును. ఇందు కొన్ని వాపసుగ్రంథములలో నుండవచ్చును. చదువరులయొద్ద మఱికొన్ని దొరకవచ్చును. అసలుస్థానమునుండి తప్పిపోయి కొన్ని ఇతరఅరలలో జేరియుండును. అట్టకట్టుటకో, మరమ్మతుకో కొన్ని వేరుపరుపబడియుండును. ప్రచారములోనున్న గ్రంథములలో వీనికార్డులు వరుసతప్పిన కారణముచే కూడ వీనిజాడ తెలియకుండుటయు సంభవమే. కొన్నిగ్రంథములు పోయినను పోయియుండును. తొలగింపబడిన గ్రంథములజాబితాలో కొన్నింటిజాడ తెలిసికొనగలుగుదుము. ఈవిమర్శనమంతయు జరిగినమీదట కనుగొనబడు గ్రంథముల కార్డులను షెల్ఫ్‌రిజిస్టరు కేబినెట్టుకు చేర్చవలెను. ఇంకను మిగిలినకార్డులను పై పరిశీలనా నివేదికతో చేర్చి ప్రధానగ్రంథభాండాగారి కప్పగించవలెను.

## మఱొకపద్ధతి

పై విధానమునకు ప్రత్యామ్నాయముగ మఱొకపద్ధతిగలదు. ఇదియు గ్రంథాలయసేవకులకు పరిచితమగుట ముఖ్యము. గ్రంథాలయముయొక్క గ్రంథవివరణ పట్టికలో గల ప్రవేశసంఖ్యలను వరుసగ నొకరిజిస్టరులోనో, విడికాగితములమీదనో ముద్రింపించి ఒక్కొక్క సంఖ్య కెదురుగ కనీసము 4 కలములనైన వదలవలెను. గ్రంథాలయములో ఒకప్రక్కనుండి మొదలుపెట్టి ఒక్కొక్క బీరువాలోని ప్రతిగ్రంథముయొక్క పై అట్టలోపలిభాగమున లిఖింపబడియుండు క్రమసంఖ్య నొకరు చదువుచు రెండవవారట్లు చదువబడిన సంఖ్యకెదురుగనున్న కలములో √ (టిక్కు) గుర్తువ్రాయుచు పోవలెను. అన్ని బీరువాలలోని పుస్తకములుపూర్తికాగానే ప్రచారములోనున్న గ్రంథములకుకూడ నిట్లే చేయవలెను. తక్కిన అన్ని సందర్భములు పై విధానమునందువలెనే యుండును. కాని ఈపద్ధతిలో మొదటిదానిలోకంటె ఎక్కువకాలము వ్యయమగుటయు, అన్నిపుస్తకములను వరుసగ నొక్కసారి పూర్తిగచూచినగాని ఫలితము తేలకపోవుటయు తటస్థించును. అయితే చిన్నగ్రంథాలయములకీ విధానమే ఎక్కువ అనుకూలముగ నుండగలదని నాతలంపు.

సశాస్త్రీయముగ ప్రతిపాదింప బ్రయత్నించిన ఈవ్యాసవిషయమును జాగ్రత్తగ పరిశీలించి చిన్న గ్రంథాలయములవారు పెద్దగ్రంథాలయములవారు కూడ, తమ తమ పుస్తకములను సరిచూచుకొను సందర్భములో ఇందలి సూత్రముల నమలు పఱచి తమ పనిని సమర్థతతో నిర్వహించగలరని ఆశించుచున్నాను.

---

# ౨౩ వ ఆం. దే. గ్రం. మహాసభ — పెదపాలెము

## అనుబంధము ౧. ఆహ్వానసంఘసభ్యులు

**రు 25–0–0 చందా చెల్లించినవారు**

వాసిరెడ్డి వెం. సు. గారి కు॥ వెంకటప్పయ్యగారు — చినపాలెం

**రు 20–0–0 చందా చెల్లించినవారు**

వాసిరెడ్డి శక్తీశ్వరుడుగారు — పెదపాలెం

**రు 15–0–0 చందా చెల్లించినవారు**

పాటిబండ్ల శివరామకృష్ణయ్యగారు, వాసిరెడ్డి నా॥ వెంకటప్పయ్యగారు, పుతుంబాక శ్రీరాములుగారు - పెదపాలెం.

**రు 12–0–0 చందా చెల్లించినవారు**

పుతుంబాక శ్రీకృష్ణయ్యగారు - పెదపాలెం

**రు 10–0–0 చందా చెల్లించినవారు**

వాసిరెడ్డి శక్తీశ్వరరావుగారు — పెదపాలెం, పిడికిటి సీతారామయ్యగారు — గుండిమెడ.

**రు 6–0–0 చందా చెల్లించినవారు**

పాతూరి నాగభూషణంగారు - పెదపాలెము

**రు 5–0–0 చందా చెల్లించినవారు**

వాసిరెడ్డి కోటయ్యగారు, వాసిరెడ్డి సత్యనారాయణగారు - పెదపాలెం. పెమ్మసాని కమలేశ్వరరావుగారు, వాసిరెడ్డి నా॥ వెంకటప్పయ్యగారు, కాకమూరి లింగయ్యగారు, వాసిరెడ్డి వెంకయ్యగారు, వాసిరెడ్డి మి॥ కోటయ్యగారు - చినపాలెం. త్రిపురమల్లు కాశీవిశ్వనాథంగారు - పేరకలపూడి. కొంగర నారాయణరావుగారు - మోరంపూడి. చల్లపల్లి రామతులశమ్మగారు - రేవేంద్రపాడు. జంధ్యాల వేంకటేశ్వర్లుగారు - గోడవర్రు. బిక్కసాని పిచ్చయ్యగారు - బిక్కసానివారిపాలెము. అక్కపెద్ది వెంకటనరసింహంగారు - తెనాలి

**రు 4–0–0 చందా చెల్లించినవారు**

డాక్టరు గాధిరాజు కోటంరాజుగారు - పెదపాలెం. అన్నె నాగేంద్రంగారు - రేవేంద్రపాడు.

### రు 3-0-0 చందా చెల్లించినవారు

రాచంశెట్టి కోటివీరయ్య - కొలగాని నాగయ్య అండ్ కంపెనీవారు - దుగ్గిరాల. సంకా వెంకటరత్నంగారు - పెదపాలెం.

### రు 2-8-0 చందా చెల్లించినవారు

చల్లపల్లి చినఆదెయ్యగారు - రేవేంద్రపాడు. వాసిరెడ్డి రంగనాయకులుగారు - పెదపాలెం.

### రు 2-0-0 చందా చెల్లించినవారు

మాజేటి జగన్నాధంగారు, పెమ్మసాని లింగయ్యగారు, వాసిరెడ్డి న॥ వెంకటప్పయ్యగారు, నారా సుబ్బారావుగారు - పెదపాలెం. బొల్లు వీరరాఘవయ్యగారు, మునునూరి వీరరాఘవయ్యగారు, గోగులపాటి రాధాకృష్ణమూర్తిగారు, మునునూరి రాఘవయ్యగారు - పేరకలపూడి. చల్లపల్లి భాస్కరరావుగారు, అన్నె బసవయ్యగారు - రేవేంద్రపాడు. అత్తలూరి రామకోటయ్యగారు - బిక్కసానివారిపాలెం.

### రు 1-8-0 చందా చెల్లించినవారు

డాక్టరు తాడేపల్లి లక్ష్మీకాంతారావుగారు - పెదపాలెం. యడ్ల శివలింగ వరప్రసాదరావుగారు - రేవేంద్రపాడు.

### రు 1-0-0 చందా చెల్లించినవారు

మేళ్లచెర్వు రాఘవయ్యగారు, పోపూరి శేషగిరిరావుగారు, పర్ణశాల రంగ రామానుజాచార్యులుగారు, వాసిరెడ్డి కోటమ్మగారు, వాసిరెడ్డి భ॥ వెంకటప్పయ్యగారు, వాసిరెడ్డి భ॥ మల్లయ్యగారు, డోగిపర్తి సత్యనారాయణగారు, పాటిబండ్ల బుచ్చయ్యగారు, పొన్నాడ లక్ష్మీనారాయణగారు - పెదపాలెం. నూతులపాటి రత్నయ్యగారు, పోలవరపు అంజయ్యగారు, నూతులపాటి పున్నయ్యగారు, నూతులపాటి సుబ్బారావుగారు, మాదినేని సూర్యప్రకాశరావుగారు, మునునూరు వెంకటచలపతిరావుగారు, కాటూరు సూర్యనారాయణగారు, మాకినేని సూర్యనారాయణగారు, మాకినేని పాపయ్యగారు, మాకినేని వియ్యన్నగారు - పేరకలపూడి

### వస్తురూపంగా యిచ్చినవారు

వాసిరెడ్డి శ॥ నరసయ్యగారు బియ్యం 28 మా., పుతుంబాక సీతారామయ్యగారు బియ్యం 15 మా., వాసిరెడ్డి శ॥ సుబ్బయ్యగారు బియ్యం 10 మా., పుతుంబాక అఖిలాండేశ్వరమ్మగారు బియ్యం 5 మా., పాతూరి బుర్రయ్యగారు మినపపప్పు 15 మా., మాలెంపాటి పుల్లయ్య & గుంటుపల్లి వెంచలయ్యగార్లు కట్టెలు 2 పట్లు, యార్లగడ్డ వెంకటసుబ్బయ్య & అత్తలూరి శ్రీరాములుగార్లు కట్టెలు 2 పట్లు—పెదపాలెం. పెమ్మసాని కోటయ్యగారు బియ్యం 7 మా., వాసిరెడ్డి రామసీతమ్మగారు కందిపప్పు 4 మా. పెసరపప్పు 2 మా.—చినపాలెం.

## విరాళములు

పుతుంబాక శ్రీకృష్ణయ్యగారిద్వారా రు 40-0-0 - పెదపాలెం. డాక్టరు బలిజేపల్లి ఉమామహేశ్వరశాస్త్రిగారు రు 0-8-0, నూతులపాటి శ్రీరాములుగారు రు 0-8-0 — పేరకలపూడి.

## అనుబంధము ౨. ప్రతినిధులు

### వ్యక్తులు : శాశ్వతసభ్యులు (ఆం. దే. గ్రం. సం.)

కొమ్మా సీతారామయ్యగారు - పటమటలంక. చల్లపల్లి పెదఆదెయ్యగారు, చల్లపల్లి చినఆదెయ్యగారు, యడ్ల శివలింగవరప్రసాదరావుగారు - రేవేంద్రపాడు. వాసిరెడ్డి రంగనాయకులుగారు, డాక్టరు గాధిరాజు కోటంరాజుగారు - పెదపాలెం. మేడిశెట్టి సుబ్బయ్యగారు - తెనాలి.

### సాధారణసభ్యులు (ఆం. దే. గ్రం. సం.)

గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు - మదరాసు. గొల్లపూడి సీతారామశాస్త్రి గారు - వినయాశ్రమము. ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు, మల్లెల శ్రీరామమూర్తి గారు - బెజవాడ. జమిలి నమ్మాళ్వారుగారు - గుంటూరు. శరణు రామస్వామి చౌదరిగారు - అమృతలూరు. వాసిరెడ్డి ఉమామహేశ్వరరావుగారు - చినపాలెం. గుంటుపల్లి సీతారామయ్యగారు - రేవేంద్రపాడు. మాలెంపాటి ధర్మారావుగారు - కొల్లూరు. డాక్టరు పసుపులేటి కృష్ణమూర్తిగారు, చావలి రాధాకృష్ణమూర్తిగారు, జమ్ములమడక మాధవరామశర్మగారు - తెనాలి. వాసిరెడ్డి హనుమంతరావుగారు, పొట్టి సుబ్రహ్మణ్యంగారు - నంబూరు. డాక్టరు తాడేపల్లి లక్ష్మీకాంతారావుగారు, పుతుంబాక బృందావన కృష్ణమూర్తిగారు, పుతుంబాక శ్రీరాములుగారు - పెదపాలెం. కస్తూరి కుటుంబరావుగారు - కనగాల. వడ్లమూడి వెంకటరత్నంగారు - మోపర్రు.

### సంస్థలు : గ్రంథాలయములు

దుగ్గిరాల : శ్రీ భాషాభిలాషిణీసంఘము 1, కంఠంరాజుకొండూరు : పింగళి సూరనామాత్య గ్రంథాలయసంఘము 1, తుళ్లూరు : శ్రీ బాలభారతీగ్రంథాలయము 1, ఖాజీపాలెము : శ్రీ సరస్వతీనిలయము 2, చిర్రావూరు : శ్రీ జితేంద్రనాథగ్రంథాలయము 1, పేరుకలపూడి : జ్ఞానోదయ గ్రంథాలయము 2, రేవేంద్రపాడు : శ్రీ వీరేశలింగపుస్తకభాండాగారము 1, పెదకొత్తపల్లి : శ్రీశారదాగ్రంథాలయము 1, పెదపాలెము : ఆర్యబాలసమాజము 1, పెదపాలెము : సేవాశ్రమవాణీమందిరము 2, కూచిపూడి : శ్రీ సరస్వతీనిలయము 2, తూములూరు : శ్రీ కమలానెహ్రూగ్రంథాలయము 1, శేకూరు : శ్రీ బాలసరస్వతీగ్రంథాలయము 1, కనగాల : శ్రీ జాతీయ బాలభారతీ గ్రంథాలయము 1, పొన్నెకల్లు : గ్రామపుస్తక భాండాగారము 1, గోడవర్రు : పటేలు పఠనమందిరము 1, శృంగారపురము : శ్రీ జ్ఞానదాయినీ పుస్తక

భాండాగారము 2, ఐలవరము : శ్రీ వివేకవర్ధనీగ్రంథనిలయము 1, ఐలవరము : శ్రీ శారదాగ్రంథనిలయము 1, (గుంటూరుజిల్లా.) ఘంటసాల : శ్రీ రామమోహన గ్రంథాలయము 1, పటమట : అచ్చయ్య ధర్మగ్రంథాలయము 1, పటమటలంక : శ్రీ మహాత్మాగాంధీ ధర్మ పుస్తకభాండాగారము 1, పెదసనగల్లు : శ్రీ శివరామ ప్రసాద్ పుస్తకభాండాగారము 1, కవులూరు : శ్రీ విజ్ఞానోదయ గ్రంథాలయము 1 (కృష్ణాజిల్లా.) గుడ్లూరు : ఎఱ్ఱాప్రెగ్గడగ్రంథాలయము 1 (నెల్లూరుజిల్లా.)

### పంచాయతీబోర్డులు

మోరంపూడి పంచాయతీబోర్డు 1, రేవేంద్రపాడు పంచాయతీబోర్డు 1, తెనాలి తాలూకా (గుంటూరుజిల్లా)

### సహకార పరపతిసంఘములు

కనగాల సహకార పరపతిసంఘము 1, (రేపల్లెతాలూకా, గుంటూరుజిల్లా)

### గ్రంథాలయసంఘములు

తెనాలితాలూకా గ్రంథాలయసంఘము 1 (గుంటూరుజిల్లా)

## అనుబంధము 3. ఆదాయవ్యయములు

| రు అ పై | జమలు | ఖర్చులు | రు అ పై |
|---|---|---|---|
| 256-0-0 | ఆహ్వానసంఘ సభ్యత్వచందాలు | భోజనం ఏర్పాట్లు | 151- 0-3 |
| 41-0-0 | విరాళములు | సభ, ప్రదర్శనం ,, | 43- 6-6 |
| 30-0-0 | ప్రతినిధిరుసుములు | తంతి, తపాలా | 41- 2-9 |
| | | ప్రయాణం | 41-11-3 |
| | | అచ్చు, స్టేషనరీ | 19- 8-0 |
| | | ఆం. దే. గ్రం. సంఘమునకిచ్చినది (ప్రతినిధిరుసుములు వగైరా) | 30- 3-3 |
| 327- 0-0 | మొత్తం మూడువందల యిరువదియేడు రూపాయలు | | రు 327- 0-0 |

ఆహ్వాన
సంఘకార్యాలయము
పెదపాలెము
(వయా) దుగ్గిరాల

పుతుంబాక సీతారామయ్య, అధ్యక్షుడు

వాసిరెడ్డి జగపతిరావు
వెనిగళ్ల సత్యనారాయణరావు
పుతుంబాక శ్రీరాములు
} కార్యదర్శులు

వాసిరెడ్డి శక్తీశ్వరుడు, కోశాధిపతి

పాతూరి నాగభూషణం
వ్యవహార & ప్రచురణశాఖాధికారి

గుంటుపల్లి పుల్లయ్య
గాధిరాజు కోటంరాజు
జంధ్యాల వెంకటేశ్వర్లు
} కార్యవర్గసభ్యులు

(11)

# LIBRARY CONFERENCE

BY

Rao Sahib S. R. Ranganathan, M. A., L. T., F. L. A.,

*Librarian, Madras University Library*

*and*

*Secretary, Madras Library Association.*

Sri Nagabhushanam's setting me an essay on 'Library Conference' for publication in the *Andhra Grandhalayam** induced in me a smile of irony, for my reaction to conferences has not been helpful and yet I had to respond, as I cannot say 'no' to a call from a sincere library worker.

As a youth I attended the first two All India Mathematical Conferences at Madras and Bombay. The sight of the dominance of those who had no mathematical urge whatever, attending them at public expense, made me recede from the conference. However my participation in the Third Rural Library Conference held at London, where considerable serious work was done, revived my enthusiasm. This made me participate in the All India Public Library Conference held at Madras in 1927, and to agree to be the Secretary of the Library Service Section of the First All Asia Educational Conference held at Benares in 1930. But again the difficulty which the President Newton Mohan Dutt and myself experienced in getting a stable audience for discussion of papers, of which we had one printed volume and typescript for another, revived in me the original scepticism.

And yet I attended the All India Library Conference, convened at Calcutta at a time when I happened to be there on public business. Here again delegates had come at public expense but it was the social functions that largly engaged attention. It was almost impossible to get a dozen librarians to discuss serious library problems, of which I had taken quite a number as I was then but a beginner in the profession. This experience confirmed my scepticism and I gave up attending conferences. However the

* The publication of 'Andhra Granthalayam' has been stoped for the present owing to the recent ordinance. Since this article was written for the Conference Number' of the above journal, it finds a place in the *Proceedings of the 23rd Andhradesa Library Conference.*

biennial sessions of this conference acted as a great release for my inner tension to express my experience in library matters and as a means to induce some of my colleagues to do some creative thinking. The result was that I thankfully received announcements of conferences and systematically sent up symposia. Circumstances so conspired that I had to be at this year's Bombay session. Mv reaction was not happy, inspite of my being the recepient of uniform kindness, induced perhaps by my continued absenteeism and by anticipatory deference to the old age that was to set on me! Still the social side and social motives predominated; friction developed almost threatening to bring about fire; but fortunately it ended happily; when, however, I happened to be at Delhi a few months later, I was concerned to find the local Library Association ablaze with sullen anger caused by events which had their root in the Bombay Conference.

* * *

I imagine I hear the whispering voice of the psyche of Sri Nagabushanam: "Can't you leave facts and turn to ideals?" I am sorry for the reminiscential mood which has set in on me, and I willingly turn to ideals.

The conference method is usually adopted for three purposes:

(1) to do propaganda;

(2) to bring about personal contact between savants; and

(3) to provide an opportunity for deciding issues which are best done by personal discussion between persons with experience.

Our country is in great need of library propaganda. The propaganda should be carried on along all possible lines; exhibition, newspapers and splashy marches. Conference too is a time-honoured method for propaganda. Our temple festivals are examples. The only trouble is the various attractions and sideshows like music, dance and fairs sometimes to smother out the main purpose that a very Jesus has so appear to demolish the octopus. A second trouble in library matters is that due to the peculiar political condition of our country; we are unable to satisfy the demand for libraries that such conferences induce in the public mind, if at all they are successful. Under these conditions the ultimate harm may turn out to be even greater than the immediate benefit.

Social contact between savants is no doubt a very desirable end of conferences. But there is always the danger of private interests, which can always be tolerated as secondary ends, tending to usurp primary position. This leads to quarrel and bickerings. However, after a good deal of experience, conference was chastened to be beneficial and to bring about concord. But as bad luck would have it, John Bull invented a decade ago a new species of conference called 'round table' conference for effectively distributing apples of discord. This seems to have reminded people of the potentialities of conferences for discord. There is also the danger of their platforms being converted into a vantage ground to release missiles tipped with gall and wormwood. There is no doubt however that such mishaps could be averted if a conference could command the services of a genial and tactful personality.

But perhaps the most enduring purpose of a conference is the third one. There is endless scope for deriving benifit of this variety in library matters. Modern librarianship is now in its infancy in India. There is every sign of at least the younger generation refusing to adopt the indolent attitude of getting along with the literature and techniques brought on board the ship from the west. They realise that national self-respect will be liquidated by its always receiving and never giving ideas on librarianship. Further, India has virtually a clean slate to write upon. It has no hampering traditions. Few of its libraries are committed beyond measure to any particular brand of technique.

Conference can be a means of utilising this freedom of India in library matters to its fullest advantage. Book selection, book ordering, periodical work, accessioning, classification, cataloguing, issue apparatus, reference service, bibliography, shelf work, library binding, and a host of other problems await being tackled in a way that is intimately suited to local requirements. Standardisation without injury to initiative, periodical revisions of standards, and maintenance of the adopted scheme of classification and code for cataloguing quite abreast of times, organisation of inter-library loan to make the resources of the country go the longest way and the establisement and maintenance of a bibliographical bereau in collaboration with international organisations, require incessant attention. Their moot problems are best solved at conferences.

84

# LIBRARY ON WHEELS

Sri D. Krishnayya
Supervisor, Municipal Library, Hindupur.

'If Muhammad does not go to the mountain, the mountain must go to Muhammad', is an old adage. Such is the policy of the Library on Wheels, or circulating library to put it in the popular style and write about it in the like way. Because the masses are not educated atleast to that degree of understanding the importance and the utility of the library, in the cultural development of the country, the workers in the library movement, from humanatarian consideration have to bring the masses in touch with the benefits of the library by bringing it to their own doors.

Advertisers we see adopting various methods to advertise their products. From the fancy paper products down to the election campaign, various advertising methods we have and the library on wheels is but a device in the effective library service, as publicity is the prime factor in life.

* * * *

The difficulty that confronts us in this line, is the want of suitable literature for the same. We are upset beset and downset with a number of handicaps in this respect. For beautiful books in bold type, good binding, pictures and tasteful get up, specially suited to children's taste we have to receive others aid. The *Library Edition* of any book in Dravidian Languages, is a rarity, for, we are not prepared to pay a decent price for such a volume. We think of cheap editions, second-hand books and even shop soiled books due to our economic condition in life. We care more for matter than for any other thing and so we see *Indian Editions* published even by the leading English firms. For example—The works of Tagore in this edition cost approximately a rupee while the other edition costs 7S 6d- Business tact in the library line we have to modestly copy from the foreign countries where this movement is in full swing to the delight of all and the glory of the nations. With the express object of attracting magically readers to the library carriage, great care has to be taken in presenting the readers with the choicest boquet of books

irrespective of the cost. In one word, the reader must be drawn to the van magically and be satisfied to the full. This we have to adopt in our object of the library on wheels or the bc it service or the like of it; to do this successfully we have › face two difficulties particularly—the paucity of such books — in the various Dravidian Languages and the want of true and willing workers in the field. Even if the scheme be adopted in our presidency alone there is the language difficulty besides that of willing workers. Let us take up only one language namely—Telugu our mother tongue, and construct in this a beautiful library on wheels and show the way for the Dravidian brethern to copy the example. In doing this, our leading publishers and pioneers in the field—Messrs. V. Ramaswami Sastrulu & Sons, Andhra Patrika Office, Ananda Press and a few leading firms of the Circars and the Rayalaseema, must give us the library editions of their special publications for this delightful Telugu Library on wheels touring over the entire Andhra Desa to the delight and dignity of Telugu Mother.

A word about the van—Telugu classics entirely earmarked for the pandits to study them leisurely and digest them bit by bit, may occupy only the display section in the van. Literature useful for the children—which is absolutely wanting in our literature, the lay reader, the average man and the general public will have to be found in plenty. Our female section and the books and periodicals suited to their taste, we should never forget.

Fine stories and lovely readers we must have in plenty. Fiction of the choicest type we richly want. Works in simple prose we should naturally include and the puranic lore in the popular style we can never forget. To suit the needs of the modern times literary experts must come to forge thought in the most lovely form on present topics and in popular style. In one word' our library on wheels, in Telugu, must be like the mighty Telugu Talkie with a noble theme, perfect star cast run under the supervision of an expert director and released to crowded houses and the film having its triumphant march.

Let us then be up and doing like *the thirsty crow* with a will and quench our literary thirst and that of our brethern too by the Library Scheme—Specially the one on wheels.

86

# TECHNIQUES IN LIBRARY SERVICE

Sri S. Seshagiri Rao, B. Sc., Dipt. L. S.

Librarian, Guntur Municipal Library

Service is the essential motto of a librarian. Readers form an important role in a library. It is the primary duty of the librarian to handle every type of reader and see that the latter is impressed by his behaviour with a feeling that library is a place of welcome and attention. The librarian should also feel that every citizen in the vicinity of the area becomes a regular user of the books.

It is not uncommon in a library to store a collection of books but it is quite uncommon to see that trained and cultured people are employed as librarians. Librarianship requires knowledge in various fields— book selection, classification, cataloguing, knowledge in bibliography etc. It also requires professional training with as much zeal and enthusiasm as that required for any other learned profession such as law, medicine or engineering. Western countries have realised this value long ago and achieved about 95% literacy as against 12% in India in 1941 census in spite of it being ruled by a foreign nation from the past over 150 years. The process of establishing contact between reader and book is known as Reference service. Several techniques are employed by the library profession in the art of creating this contact between reader and book, and the profession is trying its best to invent new ones.

## OPEN ACCESS SYSTEM

The technique which is very helpful to establish contact between reader and book is the open access. In a closed access system, the selection of book has to depend mainly on the catalogue of the library. Since library is a growing organism, the catalogue of any library will never be up to date. In case of printed catalogues, this is much worse. Further a good deal of time is wasted to select a book from the catalogue of an average library of 30,000 books. The Time lost in India may not be counted much, but in America & England, where money is time and time is money, the time factor plays great importance. This may involve some loss in books but without Sacrifice we cannot attain the ideal. It enables readers to come in contact with books which

will be otherwise lying on the shelves of the closed libraries. Experience has also proved that the change increases the number of books drawn for use.

## TICKET CARD SYSTEM

The second technique is in the method of issuing books. Each book in the library is equipped with a book card placed inside a pocket pasted on the inside of the cover. Call number of the book, its author and title are written on the book card. Each member who borrows books is given as many tickets as he is permitted to borrow at a time. Tickets are in the form of pockets that will just take book cards. Each book has a date label pasted on the first page. Due date is stamped on the date label, the book card is removed and inserted in the ticket of the borrower. The ticket with the book card is then thrown to a charged tray, where they are arranged in order of call numbers behind the date guide. Thus ends the process of issuing books. On the return of the book, the date label and the call number enables the counter clerk to locate the ticket from the changed tray. The book card is then removed from the readers' ticket and reinserted in its pocket. The ticket is then handed over to the borrower. The procedure takes only 3 to 4 minutes utmost.

## CLASSIFIED ARRANGEMENT

In a growing library, the arrangement of books is a vital affair. The utility of books is lost.if the books are not systematically arranged. Experience has proved that classifying books on the basis of subject matter is the best method. If no proper classification is made readers will go away discontented without appreciating the value of the books.

## ANALYTICAL ENTRIES

Books are artificial entities. Some books do not invite readers' attention entirely but to a portion cf their pages. Eg. In complete works of Count Rumford there is an article entitled "Excellent qualities of coffee and the art of making it in the heighest perfection" in V volume, Pp. 615-660. Across reference Card with the heading " Coffee" to Pp. 615-660 of V volume will make the book much more useful than its individual value. Similarly if the chapters of a book are written by various authors, a seperate analytical entry has to be given under each author.

## PUBLICITY

The technique of publicity attracts new readers. It is of two kinds — general and individual. General publicity emphasises the value of books and reading by public lectures, radio talks, news paper advertisements, wall posters, etc. Individual publicity has to be made by individual libraries. It is the duty of each library to see that every potential reader is converted to an actual reader by effective service, bearing in mind the general principles of publicity.

## STACK ROOM GUIDES

This is the technique of book display and shelf arrangement. This must be perfect and extremely mobile. All reference books such as year books, encyclopaedias, dictionaries etc. should be located very near to the counter and should be seperated from the general stock. Latest additions should be placed seperately from the old stock with adequate guides for each subject.

## REFERENCE SERVICE

All the above are necessary to establish contact between reader and book but are not sufficient. There must be someone to initiate the readers to make use of the above mechanised things. The Psychological tempo of every man is such that we cannot retain his custom unless he is given prompt and exact service in a personal way. He is a human being and a human personality alone can keep him in good humour and make him to appreciate the value of books. All the above techniques may prove to be a waste if proper personal service is not rendered by the library. This technique of establishing contact between reader and book by personal service is known as "Reference Service." All these seven techniques are necessary for making proper use of the library and elimination of any one of the above will prove futile to achieve the successful end.

---

### రావుసాహెబ్ గోటేటి జోగిరాజుగారి

## సచిత్ర వ్యవసాయ గ్రంథములు

1. వ్యవసాయశాస్త్ర ప్రథమపాఠములు : రెండవకూర్పు-వ్యవసాయదారులకును, యస్. యస్. యల్. సి. విద్యార్థులకును ఉపయోగకరమైనది. 300 పుటలు; వెల రు 1-0-0

2. ఉద్యానకృషి ప్రథమపాఠములు : రెండవకూర్పు - ఇందు మొదటి భాగమున పౌరోద్యానములు, గృహోపవనములు, ఆలయవనములు, బడితోటలు మొదలగు వాని నిర్మాణమునుగూర్చియు, నిర్వాహకమును గురించియు తెలుపబడెను. రెండవభాగమున పుష్పాదికములను గురించి విపులముగ వ్రాయబడెను. మూడవభాగమున శాకములను గురించియు, నాల్గవభాగమున ఫలజాతులను గురించియు సంగ్రహముగ వ్రాయబడెను. 352 పుటలు. వెల రు 1-8-0.

3. పండ్లు-మొదటిభాగము:— ఈ గ్రంథముయొక్క సహాయముతో ఫలవృక్షములను పెంచువారు సామాన్యముగ తాము చేయు లోపములను సవరించుకొని మితవ్యయముతో చక్కని తోటలను పెంచి తగినంత లాభమును పొందగలుగుదురు. 250 పుటలు; వెల రు 1-4-0.

4. పండ్లు-రెండవభాగము:— ఇందు మామిడి, జీడిమామిడి వగైరా మామిడి కుటుంబమునకు జెందిన యారుజాతులను గురించి విపులముగ వ్రాయబడెను.
336 పుటలు; వెల రు 1-4-0.

5. పండ్లు - మూడవభాగము:— ఇందు నారింజ కుటుంబమునందలి పండ్రెండు జాతులను గురించి విపులముగ వ్రాయబడెను. నారింజ, బత్తాయి, నిమ్మ వగైరా తోటలను పెంచువారి కత్యంతోపయుక్తము. 245 పుటలు; వెల రు 1-4-0.

6. పండ్ల దినుసులను నిల్వచేయుట:— పండ్లరసములను, ముక్కలను నిల్వచేయుటకును, మురబ్బాలు, లేహ్యములు, హల్వాలు మొదలగునవి తయారుచేయుటకును దోడ్పడును. 36 పుటలు; వెల రు 0-6-0.

7. FRUIT CULTURE (with special reference to the East Godavari Dt.) ఫలకృషినిగురించి యింగ్లీషున సంగ్రహాముగ వ్రాయబడిన గ్రంథము. వెల రు 0-4-0.

8. తృణధాన్యములు-మొదటిభాగము:- వరినిగురించియు, మరి నాలుగుజాతులను గురించియు విపులముగ వ్రాయబడిన గ్రంథము. 400 పుటలు; వెల రు 1-12-0.

9. చెరుకు, ఇతర చక్కెరపంటలు, పిష్టద్రవ్యములు:- ఇందు చెరుకుతో పాటు బీటుదుంప మొదలగు చక్కెరనిచ్చు యితరసస్యములను గురించియు, తాటి, యీత, కొబ్బెర మొదలగు చెట్లనుగురించియు, పిండిపదార్థముల నొసగు పాలదుంప,

కర్రపెండలము మొదలగు సస్యములను గురించియు, సగ్గుచెట్టు మొదలగు చెట్లను గురించియు గూడ యమూల్యములగు విషయములు తెలుపబడెను.

334 పుటలు; వెల రు 1-12-0.

10. కాయధాన్యములు:— కంది, పెసర, సెనగ మొదలగు 15 జాతుల పప్పు దినుసులను గురించిన విపులమైనగ్రంథము. 160 పుటలు; వెల రు 1-0-0.

పుస్తకములకు : గ్రామసేవా ముద్రాలయపు మేనేజరుగారికి, తూర్పు గోదావరిజిల్లా, కొండెవరం పోస్టుకుగాని- సేవాశ్రమము, పెదపాలెము (వయా) దుగ్గిరాల చిరునామాకు గాని వ్రాయవచ్చును.

92

# వేంకట్రామ అండ్ కో

బెజవాడ – మద్రాసు

బ్రాంచెస్: తెనాలి, గుంటూరు, బెజవాడ, తాడేపల్లిగూడెం, రాజమండ్రి, పాలకొల్లు, సికింద్రాబాదు (దక్కన్) ఒరంగల్, కర్నూలు, కడప, చిత్తూరు, కంభం.

మావద్ద ఆంధ్ర వాల్మీకి వావిలకొలను సుబ్బారావుగారి 'ఆంధ్ర వాల్మీకిరామాయణము-మందరము' అన్ని కాండలు, దొడ్ల వేంకటరామరెడ్డిగారి 'భగవద్గీతాహృదయము,' కళ్యాణానంద భారతీ స్వామివారి 'భగవద్గీత' (శంకరభాష్యం), పి. శంకర నారాయణగారి 'ఇంగ్లీషు–తెలుగు (మీడియం, జంసైజు) డిక్షనరీలు,' విద్వాన్ శ్రీ ములుగు చంద్రమౌళిశాస్త్రిగారి 'లింగపురాణము,' శ్రీ శ్రీపతి నరసింహారావు, బి. ఏ. గారి 'ప్రవాసి' (నవల), ఆంధ్ర యూనివర్సిటీవారి అన్ని గ్రంథములు, రాజకీయ, సాంఘిక, పురాణ, యితిహాస, జ్యోతిష, వైద్య, మత గ్రంథములు, నవలలు, నాటకములు మున్నగు అన్ని రకముల పుస్తకములు దొరకును.

గ్రంథాలయములకు కావలసిన పుస్తకాల నన్నిటిని ఆర్డరుపై తెప్పించి యివ్వగలము.

వివరములకు:— వేంకట్రామ అండ్ కో

బెజవాడ – మద్రాసు

81 నుండి 88 వ పేజీవరకు తెనాలి లక్ష్మీ పవర్ ప్రెస్‌లోను
తక్కినది భారతీ ప్రెస్, తెనాలిలోను ముద్రింపబడినది.



| | |
|---|---|
| మనసు ఫౌండేషన్ | |
| పుస్తకాల పరిశీలనాపట్టిక | |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA104B/36 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Habeeba |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |